వేదాలలో

# విజ్ఞాన బీజాలు

శ్రీ పం. విద్యాభాస్కర్ ప్రేమ్ చంద్రశాస్త్రి

అనుకర్త :
సంధ్యావందనం శ్రీనివాసరావు

## ఆధ్యాత్మిక జ్ఞాన సంపదకు నిలయం భారత దేశం

- డాక్టర్ డేవిడ్ ఫ్రాలే

'ఆధ్మాత్మిక జ్ఞానం కోసం పాశ్చ్యాత్య దేశాల వైపు చూడవద్దు. అది అంతా భారతదేశంలోనే ఉంది' అని అమెరికన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ వేదిక్ స్టడీస్ డైరెక్టర్ డేవిడ్ ఫ్రాలే అన్నారు. 'వేదాలు మానవాళికి గొప్ప వారసత్వంగా సంక్రమించిన, గర్వించదగ్గ ఆస్తి'గా ఆయన అభివర్ణించారు. **'మెసెజ్ ఆఫ్ వేదాస్ అండ్ మాడ్రన్ టైమ్స్'** అనే అంశంపై ఆయన ప్రసంగిస్తూ పాశ్చాత్యులు ఆర్థిక, భౌతిక విషయాల్లో సర్వస్వతంత్రులు. కానీ వైదిక సంస్కృతిలో ఉన్నటువంటి ఆధ్యాత్మిక స్వాతంత్ర్యం వారికి లేదని వివరించారు. కర్మయోగ జ్ఞానయోగ, రాజయోగ మొదలైనటువంటి యోగాల ద్వారా మానవులు భగవంతుని చేరగలరని చెపుతూ, పాశ్చాత్య నాగరికతలో కాని మరే ఇతర మతంలో ఇది లేదని అన్నారు. ధ్యానం ద్వారా అంతర్గత క్రమశిక్షణ ఏర్పడుతుందని చెప్పారు. 'నిన్ను నీవు ప్రశ్నించుకో, నీ గురించి తెలుసుకో' అని ఉపనిషత్తులు ఘోషిస్తున్నాయని ఆయన తెలియ జేశారు. ప్రస్తుత తరుణంలో వేదజ్ఞానం అవసరం ఎంతో ఉందని అన్నారు. ఇతర భాషల్లోకి వేదాల అనువాదం గురించి మాట్లాడుతూ, తర్జుమా సమయంలో అనేక తప్పొప్పులు జరిగాయన్నారు. తర్జుమా రచనలు, వేదాలపై భాష్యాలు మున్నగు వానికి అసలు వేదాలకి పొంతనలేదన్నారు. వేదాలు క్రమశిక్షణను బోధిస్తాయని సత్యాన్వేషణలో తోడ్పడుతాయని ఆయన పేర్కొన్నారు.

ఆధునిక రసాయన పదార్థాలతో తయారుచేస్తున్న అల్లోపతి మందుల కంటే ఆయుర్వేద వైద్య విజ్ఞానం ఉత్తమమైనదని న్యూమెక్సికో (అమెరికా)లోని అమెరికన్ వేదాధ్యయన సంస్థ డైరెక్టర్ డాక్టర్ డేవిడ్ ఫ్రాలే అన్నారు. 'ఆయర్వేదం' దానిపై పురాతన వేదల ప్రభావం అనే అంశంపై ఆంధ్రప్రదేశ్ విజ్ఞాన భారతి ఆధ్వర్యంలో తార్నకలోని జాతీయ పోషకాహార సంస్థ ఉపన్యాస చర్చాగోష్ఠిని ఏర్పాటు చేసింది. ఈ కార్యక్రమంలో ఆయన పాల్గొని ప్రసంగించారు. ఆయుర్వేద వైద్యం గురించి పురాతన వేదాల్లో ఎంతో విజ్ఞానం నిక్షిప్తమై ఉందని, దీనిలోని ఇంద్ర, సోమ, అగ్ని మొదలగు వాటిని విపులీకరిస్తే అపార విజ్ఞానాన్ని మనం అర్థం చేసుకోవచ్చని ఆయనన్నారు. మామూలుగా నయం కాని ఎన్నో వ్యాధులకు ఆయుర్వేదం పరిష్కారం చూపించగలుగుతోందని, అయితే ఇది కొన్ని పరిలధుల్లోనే సాధ్యమవుతుందని ఆయన పేర్కొన్నారు. యోగ, మెడిటేషన్ ప్రక్రియలవల్ల నిత్య జీవితంలో అనేక ఒత్తిడుల నుంచి ప్రశాంతత పొందవచ్చని ఆయన అన్నారు.

ఓ3మ్

# వేదాలలో
# విజ్ఞాన బీజాలు

ప్రథమ భాగము

కర్త:

విద్యాభాస్కర్ ప్రేమచంద్ర శాస్త్రి
కావ్యతీర్థ, సాహిత్యరత్న

వైద్యనాథ శాస్త్రి, నరదేవ్ శాస్త్రి, (వేద తీర్థ)

బ్ర. ప్రదీపార్య నైష్ఠిక్

అనుకర్త:

సంధ్యావందనం శ్రీనివాసరావు

గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ

గాయత్రీ గ్రంథమాల : 23
ప్రథమ ముద్రణ ప్రతులు : 1000
ద్వితీయ ముద్రణ ప్రతులు : 500
సర్వస్వామ్యములు : గ్రంథకర్తవి.
సృష్టిసంవత్సరము : 197, 29, 49, 121
విక్రమాబ్దము : 2076
కలియుగాబ్దము : 512
శ్రీ శార్వరినామ సం॥ భాద్రపదం (10-9-2020)

**మూల్యము : రూ. 30=00.**
(తపాలా ఖర్చులు అదనము)
ప్రతులకు :

1 డా॥ కోడూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
హనుమాపురం (B.O.) ; (Via.) భువనగిరి గంజ్ - 508 117.
సెల్ : 9908994084.

2. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,
కార్యదర్శి : కె.పి. నర్సింగరావు,
12-10-586/6, ఆర్యసమాజము, వారాసిగూడ,
సికింద్రాబాద్ - 500 061. (ఇందిరానగర్ రోడ్డు - 2)
సెల్ : 98480 11073

3. ఆర్యసమాజ మందిరము, రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
సీతాఫలమండి - 500 061. సెల్ : 9133134156

4. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
ఫోన్ : 08644-252789.

5. శ్రీ బాసెట్టి సత్తయ్య, జె-38, రాంగోపాల్‌పేట్, సికింద్రాబాద్ - 3.
ఫోన్ : 9948539795

*Printed at :* **PRINTSHOP** - 6632 0300.

## విషయ సూచిక

పుట సంఖ్య

ఓ3మ్

# ప్రకాశకీయం

వేదాలలో 1. జ్ఞానకాండ 2. కర్మకాండ 3. ఉపాసనకాండ 4. విజ్ఞానకాండ అని నాలుగు విషయాలకు సంబంధించిన జ్ఞానము కలదని ప్రకాండ వైదిక విద్వాంసులైన మహర్షి దయానంద సరస్వతులవారి అభిప్రాయము.

విజ్ఞానమనే సంస్కృత శబ్దంలో 'వి' ఉపసర్గ. 'వి+జ్ఞానం=విజ్ఞానం' 'వి' అనే ఉపసర్గకు - విశేషార్థే, పృథగర్థే అని ఋషులు రెండర్థాలు చెప్పారు. అంటే 1. విశేషముగా 2. వేరుగా అని రెండర్థాలు చెప్పవచ్చును.

వేదమంత్రాలు సామాన్యంగా 1. అధిభౌతికము 2. అధిదైవికము 3.ఆధ్యాత్మికమని మూడు రకముల అర్థాలను తెలియజేస్తాయని మహర్షి దయానంద సరస్వతి తన వేద భాష్యంలో తెలియజేశారు. వ్యాకరణ, నిరుక్త, బ్రాహ్మణాది గ్రంథాల ఆధారంగా వేదమంత్రాలకు ఆయన ఈ విధమైన మూడు రకాల అర్థాలను వ్రాయుట కూడా జరిగినది. ఈ విధంగా వేదమంత్రాలలో భౌతికజ్ఞానము, ఆధ్యాత్మికజ్ఞానము రెండూ నిండి యున్నాయనేది సత్యం.

మానవునకు ప్రాపంచిక భోగాలనందించుటకై ఉపయోగపడేది భౌతిక జ్ఞానం. ఈ జ్ఞానం మానవులకు సుఖాలనిచ్చుటతోపాటు విపరీతంగా వాడుకున్నచో వినాశనానికి కూడా తోడ్పడుతుంది. ఉదాహరణకు: అణుశక్తి మానవునకెన్నో విధాలుగా తోడ్పడుటతోపాటు మానవుని సర్వనాశనానికి కూడా దారి తీస్తుందనేది జగమెరిగిన సత్యం. ఆధ్యాత్మిక జ్ఞానం మానవుని - విశ్వరహస్యాలను ఆవిష్కరించిన విధాతను అన్వేషింపజేస్తుంది. అట్టి మానవుడు దానవుడు కాజాలడు. కావున ఆధునిక ఆవిష్కర్తలు చేసే పరిశోధనలు విశ్వమానవ కల్యాణానికి, విశ్వనిర్మాత సాక్షాత్కారానికి తోడ్పడితే దానిని 'విజ్ఞానమని' వారిని 'వైజ్ఞానికులని' అనుటలో ఎలాంటి దోషముండదు.

వేద విజ్ఞాన జిజ్ఞాసువులకు ఈ గ్రంథం బాగుగా తోడ్పడుతుందని నా నమ్మకం. ఈ పుస్తకమును ఎంతో సుందరంగా ముద్రించి యిచ్చిన ముద్రణకర్తలకు, ప్రింట్‌షాప్ అధికారులకు మా హృదయపూర్వక ధన్యవాదములు.

మీ
సంధ్యావందనం శ్రీనివాసరావు
గాయత్రీ ఆశ్రమ ట్రస్టు

## ప్రముఖ విజ్ఞానవేత్తల అభిప్రాయాలు

సభ్యతకు ఊయలయైన ఓ ప్రాచీన భారతదేశమా! నీకు నా వందనములు. ఓ పుణ్యభూమి! శతాబ్దముల తరబడి జరుపబడుచున్న అసభ్య, పాశవిక దారుణ దురాక్రమణలు గూడ నిన్ను మా స్మృతి పథమునుండి తుడిచివేయలేకపోయినవి. కావున నీకు ప్రణామములు. శ్రద్ధ, ప్రేమ, కళలు, విజ్ఞానములకు జన్మనిచ్చిన ఓ భారతదేశమా! నీకు అభివందనములు. సమీప భవిష్యత్తులో పాశ్చాత్య జగత్తులో మేము నీకు స్వాగతము పలుకవలసి యుండునటుల నీ ప్రాచీన కాలపు ఔన్నత్యమును పరమేశ్వరుడు నీకు ప్రసాదించుగాక! (ఫ్రెంచి రచయిత జైకాలియట్)

మాక్డోనల్ మహాశయుడు కృత్రిమముగ ముక్కును నిర్మించు విజ్ఞానము భారతదేశమునుండియే ఇతర దేశములకు వ్యాపించినట్లు తెలిపెను. చూడుడు.

" In Modem days European surgery has borrowed the operation of artificial noses from India where Englishmen became acquainted with the art in the last century" ( A History of Sanskri Literature, Page 362)

భారతీయ శస్త్ర చికిత్సా శాస్త్రమును, అందు ప్రయోగింపబడు పరికరములను డా॥ శ్రీమతి మైనింగ్ చాలా ప్రశంసించిరి.

(Ancient and Mediaval India, Vol. II, Page 364)

గణితశాస్త్రము గూడ భారతదేశమునుండియే ఇతర దేశములలో ప్రవేశించినది. ఈ సత్యము నంగీకరించుచు శ్రీ బిల్యామాజ (Bilyamza) ఇట్లు వ్రాసినాడు.

"To the Hindus is due the invention of Algebra and Geometry and their application to Astronomy."

బీజగణిత, రేఖాగణితములను కనిపెట్టి వానిని ఖగోళశాస్త్రములలో ప్రయోగించిన శ్రేయస్సు భారతీయులకే చెందును.

అరేబియావాసులు సామాన్యముగ గణితముయెక్క ఆవిష్కర్తలు కారు. వారు ఈ జ్ఞానమును భారతీయులనుండి పొందియుండిరని, తరువాత పరిశోధనలలో తేలినది. ఏలన అరేబియావాసులు ఈ జ్ఞానమును యూరపువాసుల కందించుటకు పూర్వమే భారతదేశములో బీజగణితము ఉత్కృష్టదశలో ప్రచలితమైయుండెను. అంతేగాదు, సంఖ్యావాచకములగు అంకెలు ఏ పేరుతో ప్రసిద్ధమైనవో అదిగూడ సంస్కృత నామమే.

(The India of old by Sri Umrao, Page 24)

# భూమిక - 1

## (పం. వైద్యనాథ్‌శాస్త్రి)

శ్రీ, పం. ప్రేమ్ చంద్రజీ శాస్త్రి విద్యాభాస్కర్, కావ్యతీర్థ వ్రాసిన వేదము - విజ్ఞానము అను పుస్తకమును సంశోధించి మరికొంత విషయమును చేర్చి ఈ గ్రంథము రూపొందించబడినది. దీనిని గూర్చి నా అభిప్రాయమును కోరినందున నేనీ భూమికను వ్రాయుచున్నాను.

ఇతర మతాలకు చెందిన పుస్తకములవలెనే వేదమును కూడా ఒక మత గ్రంథముగా భావించి ఆలోచించే వారికి 'వేదము - విజ్ఞానమను' శీర్షిక పరస్పర విరోధ విషయంగా తోచవచ్చును. కానీ వేదము ఈశ్వరుని జ్ఞానం. వేద మంత్రార్థాలను గూర్చి ఆలోచించినట్లైతే అనుభూతి పూర్తిగా భిన్నంగా ఉంటుంది. వేదము సమస్త విద్యల గ్రంథమని ఈ యుగంలోని ప్రముఖ ఆచార్యుడైన మహర్షి దయానంద సరస్వతి ఘోషించిరి. వేదమును నిశితంగా అధ్యయనం చేయువారి కంటికి ఈ సత్యం అడుగడుగునా గోచరిస్తుంది. వేద మంత్రాలలో అనేక జ్ఞాన- విజ్ఞానముల భండారము నిండియున్నది. వేదము ధర్మగ్రంథము. ఇది ఇతర మత పుస్తకాలవలె సృష్టినియమాలకు విరుద్ధంగా యిష్టానుసారమైన మాటలతో, చమత్కారాలతో నిండియున్నది కాదు. వేదములో ధర్మము- విజ్ఞానము కలిసినడుచుచుండును. ధర్మములేని కేవల భౌతిక జ్ఞానము వలన మానవులలో పశుప్రవృత్తి పెచ్చుపెరిగి వినాశము వైపునకు పయనించుచుందురు. అందువలన ధర్మము - జ్ఞానముల మధ్య సమన్వయముండవలెను అప్పుడప్పుడు కొందరు ధర్మమునను వైజ్ఞానికీకరణము చేయవలయుననుచుందురు. కాని ధర్మమును వైజ్ఞానికీకరణం కాదు. విజ్ఞానమును ధార్మికీకరణమొనర్చవలసిన అవసరమున్నదను సత్యమును వీరు మరచిపోవుచుందురు. వాస్తవమునకు వేదధర్మం విజ్ఞానముతో (ముడిపడి) కలిసియున్న ధర్మం. వేద విజ్ఞానమెల్లప్పుడూ ధర్మంతో ఓతప్రోతమైయున్నది. యజుర్వేద మంత్రాలలో ఈ భావనను తెలుపు ఒక మంత్రమిట్లున్నది. అది

"విద్యాం చా విద్యాం చ యస్తద్వేదో భయం సహ"

***(యజు 40-14)***

అనగా ధర్మము- విజ్ఞానము కలిసి నడువవలయును.

వేదములో విజ్ఞానము గంభీర భావముతో నిండిన శబ్దములతో వర్ణించబడినది. ఈ క్రింది యజుర్వేద మంత్రాలు ఎంత సుందరమైన భావాలను తెలియజేయుచున్నవో చూడుడు..

1 కః స్విదేకాకీ చరతి క ఉ స్విజ్జాయతే పునః ।
కిగ్ం స్విద్ధిమస్య భేషజం కిం వావపనం మహత్ ॥
సూర్య ఏకాకీ చరతి చంద్రమా జాయతే పునః ।
అగ్నిర్ హిమస్య భేషజం భూమిరావపనం మహత్ ॥

(యజు 23-9, 10)

2. పృచ్ఛామి త్వా పరమంతః పృథివ్యాః పృచ్ఛామి యత్ర
భువనస్య నాభిః । పృచ్ఛామి త్వా వృష్ణో అశ్వస్య రేతః
పృచ్ఛామి వాచః పరమం వ్యోమ ఇయం వేదిః పరో
అంతః పృథివ్యా అయం యజ్ఞో భువనస్య నాభిః । అయం
స్యోమో వృష్ణో అశ్వస్య రేతో బ్రహ్మాయం వాచః పరమం వ్యోమ॥

(యజు 23-61, 62)

పై వేద మంత్రములలోని రెండు జంటలలో మొదటి మంత్రంలో ప్రశ్న తరువాతి మంత్రంలో దానికి ఉత్తరమున్నది. మొదటి రెండు మంత్రాలలోని మొదటి మంత్ర మీ ప్రశ్నలను వేయును-

1. ఒంటరిగా తిరుగునదేది? అనగా ఏ గ్రహం చుట్టూ
తిరుగనటువంటిదేది? అని భావము.
2. నలువైపులా తిరుగునదేది?
3. చలికి మందేది?
4. విత్తనము మొలకెత్తుటకు అన్నింటికంటె పెద్ద క్షేత్రమేది?

రెండవ మంత్రంలో పై ప్రశ్నలకు వరుసగా జవాబులీవిధంగా నున్నవి.

1. సూర్యుడు దేని చుట్టూ తిరుగడు.
2. చంద్రుడు నలువైపులా తిరుగుచుండును
3. చలికి మందు వేడి (అగ్ని)
4. విత్తనములు మొలకెత్తుటకు అన్నింటికంటే పెద్ద క్షేత్రం భూమి.

ఇదే విధంగా రెండవ జంటలోని ప్రథమ మంత్రంలో ఈ క్రింది ప్రశ్నలు కలవు-

1. హే బ్రహ్మన్! నేను పృథివికి కేంద్రమును అడుగుచున్నాను.
2. భువనములకు నాభిని అడుగుచున్నాను.
3. అగ్నియొక్క అన్నింటికంటె గొప్పశక్తిని అడుగుచున్నాను.
4. వాణి శబ్దములయొక్క జన్మస్థానమును అడుగుచున్నాను.

గెండవ మంత్రంలో వరుసగా జవాబు లీవిధంగా నున్నవి.

1. ఈ వేది (కేంద్ర బిందువు) భూమికి మధ్య భాగము. అనగా భూమి గుండ్రంగానున్నది.

2. యజ్ఞమే ఈ భువనమునకు నాభి.

3. అగ్నియొక్క అన్నింటికంటె గొప్పశక్తి విద్యుత్తు.

4. వేదవాణికి జన్మస్థానము పరమేశ్వరుడు. శబ్దమునకు జన్మస్థానము అకాశము.

మచ్చుకు కొన్ని వేద మంత్రాలిచ్చుట చూపుట జరిగినది. వేదాలలో విజ్ఞాన భండారము నిండియున్నది. దీని నన్వేషించు టవసరము. వేదము- విజ్ఞానమునకు సంబంధించిన అనేక విషయాలు ఈ లఘు గ్రంథంలో లభించును. దీని ద్వారా వేదంలో ఎటువంటి విజ్ఞానం నిండియున్నదో స్వయంగా తెలుసుకోవచ్చును.

వేదాల నధ్యయనం చేయుటలో ఇదొక విశేష ప్రణాళిక - మార్గము. దీనిని మహర్షి దయానంద సరస్వతి చూపిరి. ఈ ప్రణాళికలో మంత్రములను గూర్చి ఆలోచించునపుడు అడుగడుగునా విజ్ఞానమును దర్శింతుము. వేదముయొక్క నిజ స్వరూపమును కూడ ఈ మార్గంతోనే తెలియజేయగలము. భగవానుడిచ్చిన వైదిక శ్రుతి స్వయంగా దీనిని స్పష్టపరచుచున్నది-

**తిస్రోవాచ ఈరయతి ప్రవహ్నిర్ ఋతస్యధీతిం**
**బ్రహ్మణో మనీషామ్। గావోయంతి గోపతిం**
**పృచ్ఛమానాః సోమం యంతి మతయో వావశానాః**

**(ఋగ్వేదం 9-97-34)**

అనగా ఋక్ యజుస్ సామములనెడు మూడు రకముల జ్ఞానంతో కూడిన వాణిని జగత్ను ధరించు పరమేశ్వరుడు ప్రేరణతో నిచ్చును. ఈ వాణి ఋత - శాశ్వత సృష్టినియమముయొక్క అధ్యయనము బ్రహ్మాండముయొక్క జ్ఞానము.

ఈ గ్రంథకర్త ఎంతో పరిశ్రమతో వేద విజ్ఞానమునకు సంబంధించి చాలా విషయాలను ఈ పుస్తకంలో వ్రాసిరి. ఆయన పరిశ్రమ ధన్యవాదములకు పాత్రమైనది. దీనివలన వేదమును చదవాలనే కోరిక ప్రజలలో అధికమౌతుంది. దీనిని ముద్రించు కార్యభారమును సార్వదేశిక సభ వహించుట ముదావహము. లఘు గ్రంథమైనా ఇది ఉపాదేయము. సంగ్రాహ్యము. అందరూ దీనిని చదివి, ప్రచారము చేయుదురని,గ్రంథాలయాలలోను, సమాజాలలో ను ఉంచుదురని ఆశించుచున్నాను.

## భూమిక - 2

(పం. నరదేవ్‌శాస్త్రి, వేద తీర్థ - జ్వాలాపూర్)

"ప్రత్యక్షేణానుమిత్యావా, యస్తూపాయో న బుధ్యతే ।
ఏతం విదన్తి వేదేన, తస్మాద్ వేదస్య వేదతా ॥"

ఈ లఘు గ్రంథములో సుయోగ్యలేఖకుడు సుమారు నలుబది విషయాలను గూర్చి తెలియజేయుటకు ప్రయత్నించెను. ఇవన్నీ వేదమూలకమనుటలో ఏ మాత్రం సందేహం లేదు. 'వేద' శబ్దము అన్వర్థ సంజ్ఞను తెలుపునది. వేదమనగా జ్ఞానం. వేదమనగా విజ్ఞానం. సృష్టికి సంబంధించిన సమస్త జ్ఞాన -విజ్ఞానమంతా 'వేద' శబ్దార్థంలో ఇమిడియున్నది. ఆ జ్ఞానము మూలరూపంలోనే లభించును. నాలుగు వేదాలలోని ప్రతి ఒక్కొక్క మంత్రమును పరిశీలించి ప్రపంచమునందలి సమస్త సాహిత్య - సంగీత - కళా - జ్ఞాన - విజ్ఞానములన్నింటికీ మూలము వేదమని బాగుగా ఆలోచించి తెలుసుకొని నిశ్చయమునకు వచ్చితిమి. దీని ఆధారంగానే ఆర్య సమాజం వేదములను సమస్త సత్య విద్యలకు మూలమని నమ్ముతూ వస్తున్నది. వేదములలో ఏఏ జ్ఞాన - విజ్ఞానములకు సంబంధించిన మూలమున్నదను విషయమునుగూర్చి తెలుపుటకు ఒక పెద్ద గ్రంథము తయారగును. సాధారణంగా వేద మంత్రాలకుచెప్పబడిన దేవతలను చూచినచో కూడా చాలా వరకు ఈ విషయం బోధపడుతుంది.

స్వామీజీ చెప్పినట్లుగ ప్రతి మంత్రమునకు మూడు రకములైన ఆధ్యాత్మిక, ఆధిదైవిక, ఆధి భౌతిక అర్థములను చూచినచో జ్ఞాన- విజ్ఞానముల మూలమునకు హద్దు ఉండదు. సంక్షిప్తంగా చెప్పాలంటే వేదములలో మానవులకుపయోగపడు జ్ఞానమంతా బీజ రూపంలో నున్నదని చెప్పవచ్చును. వ్యక్తిగతమైన, సామాజికమైన, కుటుంబము నకు సంబంధించిన, సామూహికమైన, జానపదమునకు చెందిన కర్తవ్యకర్మలకన్నింటికి సంబంధించిన జ్ఞానము వీనిలో కలదు. ఇందు కర్తవ్యాకర్తవ్య కర్మలన్నీ విధి నిషేధముల రూపంలో ఉల్లేఖింప బడినవి. ఇదికాక మానవ సమాజమునకు సాక్షాత్ సంబంధము కల మూడు లోకాలను, 33 దేవతలను, ఋతువులు సంవత్సరాల చక్రమును అన్నింటినీ వేదము ఉల్లేఖించుచున్నది. సాంఖ్య యోగ న్యాయ వైశేషిక పూర్వ- ఉత్తర మీమాంసా శాస్త్రాల మూలము కూడ వేదములలోనే కలదు. అక్షర విద్య, నాశరహిత తత్త్వమూలము వేదములలోనున్నది.

యజుర్వేదంలోని 18వ అధ్యాయ చమకమును చదివినచో ఈ విషయంలో ఎటువంటి సందేహం ఉండదు. యోగ్యతతో కూడిన ఈ గ్రంథ రచయిత సంక్షిప్తంగాతెలిపిన విషయాలు మననం చేయదగినవి. ఉదాహరణకు

చత్వారి వాక్ పరిమితా పదాని తాని విదుర్ బ్రాహ్మణా యే మనీషిణః , గుహాత్రీణి నిహితా నే గయన్తి తురీయ వాచో మనుష్యా వదన్తి॥

ఈ వేద మంత్రము భాషా విజ్ఞానమునకు మూల మంత్రం. దీనిలో మూడు వాణులు గుహలో దాగియున్నవని చెప్పబడినది. మనుష్యుడు చతుర్థ వాణిని మాట్లాడును. ఈ నాలుగు వాణులు వరుసగా 1. పరా 2. పశ్యన్తీ 3. మధ్యమా 4. వైఖరీ అను నామములతో ప్రసిద్ధమైనవి. మహాభాష్యకారుడైన పతంజలి మహర్షి ఈ విధంగానే నిర్వచించిరి.

ఈ మంత్రం యొక్క రెండవ ఉపవ్యాఖ్యానంతో వచనములు, విభక్తులు, శబ్ద సమూహములన్నింటి విభాగముల జ్ఞానము కలుగును. సారాంశమేమనగః- మనుష్యుడు వైశేషిక సూత్రములో చెప్పినట్లుగ - "బుద్ధిపూర్వావాక్ కృతిర్వేదే" అను తత్వమును తెలుసు కున్నచో వేదమూలకమైన ఉపబృంహనా విధితో పనులన్నీ నెరవేరును. ముందుగ వేదములతో వేదమును తెలుసుకొను విధిని నేర్వవలయును. తపస్సు అభ్యాసములతో ఈ విధి తెలియును. వేదాధ్యయనము చేయు పరంపర పూర్తిగా లోపించినందున వేదములతో వేదమును తెలుసుకొను పద్ధతికూడా నేడు లోపించినది. ఇందువలననే వేదోపబృంహణ విధి కూడా లోపించినది. కావున దీనిని మరల ఉద్ధరించుటవసరము. వేదములను ప్రేమించువారు అనుబంధ చతుష్టయమును బోధించుచుండవలయును. అనగా 1. వేదముల విషయము 2. వేదముల ప్రయోజనము 3. వేదములకు అధికారి 4. వేదము- వేద జ్ఞానమునకు గల సంబంధములను గూర్చి నిరంతరము తెలియజేయుచుండవల యును. దీని వలన ఆర్య సంస్కృతిని ఉపాసించే వారికి వేదములపై గల శ్రద్ధ వృద్ధియగుచుండును. అప్పుడే మనం మహర్షిమనువు చెప్పినట్లుగ నిజమైన వేద పాలితులము కాగలుగుదుము. వేదములలో ఏమున్నదో మనం తెలుసుకోనంత వరకు, వానిలో చెప్పబడిన విధి నిషేధముల రూపంలో గల అజ్ఞలను పాలించుట, తద్వారా మనలను మనము రక్షించుకొనుట ఎట్లు సాధ్యము?

ఉన్నతి చెందుట అత్యంత అవసరము. ఛాందోగ్యోపనిషత్తులో నారదమహర్షి వివిధ విద్యలను అధ్యయనమొనర్చు విధానమును గూర్చి చెప్పెను. అవన్నియు అపరావిద్యలోనికి వచ్చును. పరావిద్యయొక్క మూలం కూడా వేదములలో నున్నది.

**ఋచో అక్షరే పరమే వ్యోమన్ యస్మిన్ దేవా అధి విశ్వే నిషేదుః। యస్తన్న వేద కిమృచా కరిష్యతి య ఇత్తద్విదుస్త ఇమే సమాసతే॥**

**(ఋగ్వేదం (1-164-39)**

"శబ్ద బ్రహ్మలో తగుల్కొని లౌకిక జ్ఞాన-విజ్ఞానంలో తగుల్కొని పరమాత్మ దేవునిగూర్చి తెలియనివాడు ఎంత తెలుసుకున్నా ఏమీ తెలియనివానితో సమానమని" ఈ వేద మంత్రముయొక్క మూలార్థము. సారాంశమేమనగా:- "వేదము సమస్త సత్యవిద్యల పుస్తకము" అను మాట అక్షరాల నిజం. సృష్టి ఉత్పత్తికి ముందునుండి ఆరంభించి సృష్టి జరిగినప్పటి వరకు గల భావ చిత్రము (వర్ణన) వేదములలో కలదు. 33 దేవతల గతి-విధుల మాట వేదములలో కలదు. సూర్య చంద్ర నక్షత్రాదులను గూర్చి వానిలో కలదు. పంచమహా భూతములు, పంచతన్మాత్రాదుల వివరణ వానిలో కలదు. శరీరవిజ్ఞానము, మనోవిజ్ఞానము, ప్రాణ విజ్ఞానము, ఆత్మ విజ్ఞానములను గూర్చి వేదాలలో కలదు. వేదాలలో మూల రూపంలో లేనిదేమిటో చెప్పుటే కష్టము.

ఈ లఘు గ్రంథములో సుయోగ్య రచయిత ఏఏ వేద మంత్రాలతో ఏఏ విషయాలను గూర్చి వివరించుటకు ప్రయత్నించెనో ఆయా విషయాలను గూర్చి చెప్పే ఇతర వేదమంత్రాలు కూడా కలవు. ఆధునిక విజ్ఞానంతో నేడు తయారు చేయబడిన, మెరుగుపరచబడిన వివిధ యంత్రాలు, శకటాలు, తదితర సాధనాలను గూర్చి యథాతథంగా వర్ణనలు వేదాలలో లభించుననుట అసంభవమే. చక్రము, రథము, శకటము (బండి) విద్యుత్ మరియు వాటిని ఉపయోగించు విషయాలను గూర్చి వేదాలలో మూలరూపంలో చెప్పబడినందున బుద్ధిమంతులైన వారు సహజంగానే నిర్మించుకొనగలిగి వానితో లాభమును పొందగలుగుదురు. మన పూర్వులైన ఋషి మునులు, మహర్షులు వేదముల జ్ఞానంతో ఉపవేదాలను సృష్టించిరి. ఆ ఉపవేదాల ఆధారంగానే జ్ఞాన- విజ్ఞానములకు చెందిన వేలాది గ్రంథాలు రచింపబడ్డాయి. నేడు వందలాది ప్రాచీన సంస్కృత గ్రంథాలు కాలగర్భంలో కలిసిపోతున్నాయి. ఎన్నో గ్రంథాలు విదేశాలకు అమూల్య సంపదగా మారి వారి గ్రంథాలయాల శోభను పెంపొందించుచున్నవి. చాలా గ్రంథాలుఈ దేశంలోనే ఉన్నా చేతికందుట లేదు. (ముద్రణ కాలేదు) ప్రాచీన సంస్కృతిని ఉపాసించే వారిలో కొందరైనా తమ సంస్కృతిపై అభిమానముండి దానిని మెరుగుపరచుటకై తీవ్రముగ శ్రమించుటకు ముందుకువచ్చినచో అసాధ్యమైనదేముండును?

*"నా సాధ్యం తపస: కించిత్"*

మహర్షి మనువు ఘోషించినట్లుగ -

***" యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి న తత్ క్వచిత్"***

వేదాలలో ఉన్నదే విస్తారంగా జగత్తున ఉన్నది. వేదాలలో లేనిది ఎచ్చటాలేదు.

***చాతుర్వర్ణ్యం త్రయోలోకా: చత్వారశ్చాశ్రమా: పృథక్।***

భూతం భవ్యం భవిష్యం చ, సర్వం వేదాత్ ప్రసిద్ధ్యతి॥ (12-97

శబ్దః స్పర్శశ్చ రూపం చ, రసో గంధశ్చ పంచమః ।
వేదాదేవ ప్రసూయంతే, ప్రసూతిర్ గుణ కర్మతః ॥ (12-98

బిభర్తి సర్వభూతాని వేదశాస్త్రం సనాతనమ్ ।
తస్మాదేతత్పరం మన్యే, యజ్జంతో రస్య సాధనమ్ ॥ (12-99

సేనాపత్యం చ రాజ్యం చ దండనేతృత్వమేవ చ ।
సర్వలోకాధిపత్యం చ, వేదశాస్త్ర విదర్హతి॥ ( 12-10

వేదాలలో విజ్ఞానమునకు మూలం అచ్చటచ్చట ప్రశ్నోత్తరాల రూపంలో కూడ ఉన్నది. యజుర్వేదము మరియు ఋగ్వేదములలో చాలా చోట్ల స్పష్టంగా ఆ ప్రశ్నోత్తరాల కలవు. అచ్చటచ్చట కేవలం ప్రశ్నలతో కూడిన మంత్రాలు కూడా ఉన్నవి. ఈ ప్రశ్నోత్త రూపంలోనున్న మంత్రాల అధారంగానే ప్రాచీన కాలంలో వైదిక సాహిత్య రచ జరిగినది. ఇవి వేద విదుల బుద్ధి వికసించుటకు సాధనములు కాగలవు. ఋగ్వేదంలో 'నాసదీయ సూక్తం' ఎంత భావగర్భితముగనున్నదో తత్త్వజ్ఞులకు తప్ప యితరులెవరెఱ గుదురు? వేదంలో విజ్ఞానం లేదనే వారికి నిరుక్తంలో చెప్పిన ఈ వాక్యం అన్వయిస్తుంది

**నైష స్థాణోరపరాధో యదేవ మంధో న పశ్యతి,**
**పురుషాపరాధః న భవతి, పారోవర్య విత్సు తు**
**వేదితృషు భూయోవిద్యః ప్రశస్యోభవతి ।**

గ్రుడ్డివాడు వృక్షమును చూడలేకపోవుట వృక్షము తప్పుకాదు కదా! అది చూడలేని వారి అపరాధము. వేదవిదులలో ఎక్కువ విద్యనెరిగిన వారి మాట ప్రమాణముగానంగీకరింపబడును. వారే పొగడబడుదురు!

**యస్తి త్యాజ సచివిదం సఖాయం న తస్యవాచ్యపి**
**భాగో అస్తి । యదీం శృణోత్యలకం శృణోతి న హి**
**ప్రవేద సుకృతస్య పంథామ్॥** **(ఋగ్వేదం)**

ఈ కోటికి చెందిన వారికి వేదాల మర్మం తెలియదు. అటువంటి వారిని -
**"వాచం శుశ్రువాం అఫలా మపుష్పామ్"**
ఇదే వేదోక్తి. అటువంటి అజ్ఞానులు, అల్పజ్ఞుల విషయమై వేరేమి చెప్పబడును

ఓ౩మ్

# వేదాలలో విజ్ఞాన బీజాలు

## వేదములో అద్భుత విజ్ఞానము :

మహర్షి దయానందుడు ఆర్యసమాజ నియమములలో- 'వేదము సమస్త సత్యవిద్యల గ్రంథ'మనిరి. ఋగ్వేదాది భాష్యభూమికలో పరమేశ్వరుని మొదలు తృణపర్యంతముగల పదార్థములన్నింటి వర్ణన వేదములలోకలదని ఆయన వ్రాసిరి. శ్రీ శంకరాచార్యులు కూడా వేదాంతదర్శనములోని 'శాస్త్రయోనిత్వాత్' అను సూత్రమునకు వ్యాఖ్యానము వ్రాయుచు జ్ఞాన విజ్ఞానములన్నింటికి వేదము మూలమనిరి. వీరేగాక విదేశీయ విద్వాంసులు కూడా అనేకచోట్ల- 'నేటి వరకు కనుగొనబడిన విజ్ఞానమంతా వేదములలోనిదే'నని ముక్త కంఠముతో అనిరి.

ప్రాచీన భారతీయులను ఆటవికులు, సభ్యతలేని వారని అన్నవారంతా వేదములోని అద్భుత విజ్ఞానమును చూచి ఆశ్చర్యపోవుచున్నారు.

నేడు వాణిజ్యము బాగాపెరిగినది. క్రొత్త క్రొత్త పద్ధతులు రూపొందుచున్నవి. సముద్రమార్గముద్వారా వ్యాపారము బాగా విస్తరించినది. కాని నేటి వరకు విమానముద్వారా ఆకాశమార్గమున వ్యాపారముచేయు పద్ధతి ప్రారంభము కాలేదు. వేదములను గొఱ్ఱెల కాపరుల గీతములను వారు, వేదములలో ఆకాశమార్గమున వ్యాపారమును గూర్చి చక్కగా వర్ణింపబడినదని చెప్పిన ఆశ్చర్యపోవుదురు. అథర్వ వేదములోని మంత్రములో-

మం॥ *యే పన్థానో బహవో దేవయానా, అంతరా ద్యావా*
*పృథివీ సంచరంతి । తే మా జుషంతాం పయసా*
*ఘృతేన, యథా క్రీత్వా ధనమాహరాణి ॥*

భూమి, ఆకాశముల మధ్యమార్గములలో ఎక్కువగా వాహనములు నడచునట్టి మార్గములు నన్ను పాలు, నెయ్యిలతో తృప్తిపరచు గాక! వ్యాపార నిమిత్తము ఆకాశమార్గమున పయనించు నేను వస్తువులను కొని ధనము సంపాదించెదనని పై వేద మంత్రార్థము.

ఈ వర్ణనతో ప్రాచీన విజ్ఞానముతో ఆకాశ మార్గము ద్వారా కూడా వ్యాపారము బాగుగా జరుగుచుండెడిదని తెలియుచున్నది. నేడు ఒకచోట నుండి మరొకచోటికి వ్యాపారులు వ్యాపారనిమిత్తము విమానములలో వెళ్ళుచుందురు. కాని ఈ వేదమంత్రములోని రెండు విషయములు చాలా ఆశ్చర్యపరచునవి కలవు. ఒకటి : భూమి-ఆకాశముల మధ్య మార్గము తయారు చేయబడియున్నది. నేటి విమానచాలకుడు (PILOT) దిక్సూచి యంత్రము ద్వారానే విమానము పయనించు మార్గమును తెలుసుకొని ప్రయాణము చేయుచుండును. రెండవది : ఆ మార్గములో పాలు, నెయ్యి దొరకుచుండేవి. యాత్రికులైన వ్యాపారులు మార్గమధ్యలో తమ ఆకలిని తీర్చుకొని సుఖముగా ప్రయాణము చేయుచుండిరి.

వేదములలో గణితవిద్య, భూకంపములు, జలప్రళయములు, విద్యుత్ ప్రమాదములు, వాయు ప్రళయములు, నైతికవిద్య, రసాయన, శిల్ప, ధనుర్విద్య, జ్యోతిషాది అన్నిరకముల విద్యల వర్ణన కలదు. వేదములపై శ్రద్ధలేని వారు మొదట వేదాలను కల్పితకథలనిరి. ప్రాచీనకాలమున భారతదేశము చాలా ఉన్నతస్థితిలో నుండెడిదని, ఇచ్చటినుండే అనేకరకాల విద్యలు, కళలు మరియు చాలా ఇతర వస్తువుల ప్రచారము యూరపులో ప్రవేశించినదని యిప్పుడిప్పుడు పాశ్చాత్య విద్వాంసులు కూడా నెమ్మదినెమ్మదిగ అంగీకరించుచున్నారు.

భారతదేశంలో వేదముల ప్రచారము బాగుగానున్నప్పుడు ఈ విద్యలన్నీ ప్రజలు నేర్చుకొనుచుండిరి. కాలాంతరమున వేదములను అర్థం చేసుకొను వారు కూడా భారతదేశంలో కరువైనపుడు యిక ఈ విద్యల ప్రచారము ఎలా జరుగును? ఇప్పుడు విదేశీయులు విజ్ఞానంలో ఉన్నతి నొందినా యూరపులోని విద్యలన్నీ ప్రారంభంలో భారతదేశం నుండే వచ్చినవని వారు స్వయంగా అంగీకరించెదరు. ఇప్పుడు వేదముల ప్రచారం మరల జరిగి పరమేశ్వరుని కృపవలన భారతదేశంలో ప్రాచీన కాలం మరల పునరావృతమైనచో వేదములలోని అద్భుత విజ్ఞానము మరల ఆవిర్భవించును. ఈ లఘు గ్రంథములో వేదములోని కొన్ని విజ్ఞానములను గూర్చి (దిగ్దర్శనము) తెలియజేయుటకు

ప్రయత్నము చేసితిమి.

**(అ) సూర్యుని ఆకర్షణశక్తి పృథివి ధారణశక్తి**

భూమి ఒక ఎద్దుకొమ్ములపై నిలిచి ఉన్నదని పురాణ కథలలో కలదు. కథను వ్రాసిన రచయిత ఈ కథను సారగర్భితముగా వ్రాసెను. కాని మనపండితులు ఏమీ ఆలోచించకుండా అట్లే నమ్మసాగిరి. యజుర్వేద మంత్రములకు వ్యాఖ్యానము చేసినవారు 'వృషభో దాధార పృథివీమ్' అను వాక్యమునకు 'ఎద్దు భూమిని మోయుచున్నద'ని అర్థమును వ్రాసిరి. కాని వేదములోని శబ్దములన్నింటికి అర్థములను వ్రాసిన యాస్కమహర్షి 'వృషభ' శబ్దమునకు చెప్పిన అర్థమును వీరు చూడలేదు. మహర్షి యాస్కుడు యిట్లు వ్రాసిరి-

'వృషభః కస్మాత్ - వర్షయితా అపామ్' అనగా నీటిని వర్షింపజేయునది 'వృషభ'మని అర్థము. ఎద్దు వర్షమును కురిపించునా? వర్షము సూర్యుని ద్వారా కురియును. యజుర్వేదములో ఒకచోట 'సహస్ర శృఙ్గో వృషభో ఉదధీత' అని కలదు. అనగా వెయ్యి కొమ్ముల ఎద్దు బయలుదేరినది అని అర్థము. ఇచ్చట 'శృంగ'మనగా సూర్యుని కిరణమని అర్థము.

మహర్షి యాస్కుడు శృంగ శబ్దమునకు అర్థమును వ్రాయుచు-

'శృఙ్గః కస్మాత్, శృణాతేః' శృంగమనగా విశ్లేషణ చేయునది. (DISECTION) వేరు చేయునది అని వ్రాసెను. సూర్యుని కిరణములు తనవేడిమితో పదార్థములన్నింటిని వేరువేరు చేయును. కనుక ఇప్పుడు 'సహస్ర శృఙ్గో వృషభో ఉదధీత' అను వాక్యమునకు అనేక కిరణములు కల సూర్యుడు ఉదయించెను అని అర్థమగును. వేదములో యింకా ఇట్లున్నది. 'వృషభో దాధార పృథ్వీమ్' అనగా సూర్యుడు భూమిని ధరించెను. 'ధృఞ్' ధాతువుతో 'లిట్' లకారములో 'దాధార' అను శబ్దము తయారగును. ఈ ధాతువునకు ధరించి పోషించుట అని అర్థము. సూర్యుడు భూమండలమును ధరించి తన వేడిమితో ప్రాణులను, వనస్పతులను పోషించును.

ఈ విధంగా మన భూమి సూర్యుని ఆశ్రయించియున్నదని సూర్యుని ఆకర్షణతోనే (ఆకాశంలో) నిలిచి యున్నదని నిరూపించబడినది.

**(అ) మూడగ్నులు**

వేదము అద్భుత విజ్ఞానముతో కూడిన పుస్తకము. విజ్ఞానము చా సంక్షేపంగాను, ఇంగిత రూపములోను (పరమేశ్వరుని అభిప్రాయమ చెప్పబడినది. వైదిక విజ్ఞానము మూడు అగ్నులను గూర్చి చెప్పుచున్నది. పార్థివ అగ్ని (FIRE) 2. అంతరిక్ష అగ్ని (ELECTRICITY) 3. ద్యులోక అగ్ని (SU ఋగ్వేదములో పార్థివ అగ్ని (FIRE) ద్వారా విజ్ఞానము చూపబడిన ఋగ్వేదములోని మొదటి మంత్రము-

**'ఓ3మ్ అగ్ని మీళేపురోహితమ్ యజ్ఞస్య దేవమృత్విజమ్ హోతారం రత్నధాతమమ్'।**

ఈ మంత్రములో పార్థివ అగ్నికి చాలా విశేషణములు చెప్పబడిన పురోహితమ్ = మనముందున్న; ఋత్విజమ్ = ఋతువులను ఏర్పరచుచున్న రత్నధాతమమ్ = రత్నములు, వజ్రములు మున్నగు వానిని పుష్టిచేయునది వాస్తవముగ ఈ పార్థివ అగ్ని ప్రతివస్తువులో ఉన్నది. లతలు, మొక్కలు ఈ అ వలననే పెరిగి పెద్దవగుచుండును. ఋతువులన్నీ అగ్నిశక్తిలోని హెచ్చుతగ్గు కారణంగా పరిపుష్టములగును. రత్నములు కాంతితో మెరయుటకు కూడా అగ్నే కారణము. ఇది విజ్ఞానముతో కూడిన సిద్ధాంతము. యజుర్వేదము అగ్నిస్తుతిని గూర్చి ఒక మంత్రమున్నది. దానిలో ఈ సిద్ధాంతము వర్ణించబడిన

*మం॥ గర్భోz స్యోషధీనామ్, గర్భోవనస్పతీనామ్ ।*
*గర్భో విశ్వస్య భూతస్యాగ్నే గర్భోz యామసి ॥*

**(యజుర్వేదము 12-37**

హే అగ్ని! నీవు ఓషధుల గర్భముననున్నావు. వనస్పతుల గర్భము నున్నావు, మున్నగునవి.

**(ఇ) వనస్పతి విజ్ఞానము**

సూర్యుడు భూమిలోని జలమును పైకి ఆకర్షించుననున విజ్ఞానమునకు సంబంధించిన విషయము. వృక్షములు-లతాదులలో ఉన జలమును (రసము) సూర్యుడు తనవైపునకు లాగుకొనును. మన భౌతిక అ కూడా ఆ జలముతో పాటుగ పైకి పోవుచుండును. ఎంత అధికముగా రసమ

పైకి ఆకర్షింపబడునో అంత ఎక్కువగా మొక్కలు, చెట్లు పెరుగుచుండును. వేదములలో కూడా ఈ సిద్ధాంతము ప్రతిపాదింపబడినది.

*మం॥ ప్రమాతుః ప్రతరం గుహ్యమిచ్ఛన్, కుమారా న వీరుధః సర్పదుర్వీ ।*

**(ఋగ్వేదము 10-72-3)**

అనగా : భూమాతపై గల లతలలో నుండి, ఆ లతల యొక్క ఉత్కృష్టతమమైన గుహ్యస్థాన మూలమునుండి కోరికతో అగ్ని స్వేచ్ఛగా పిల్లలవలె పైకెగయుచున్నది.

**చెట్లు, మొక్కల ఆకులు పచ్చగా ఎందుకుండును?**

***మం॥ పిశఙ్గం ద్రాపింప్రతి యుంజతే కవిః ।***

**(ఋ. 4-53-2)**

అనగా : సూర్యుని కిరణాల ఎరుపు భూమిలోని నలుపురంగు రసము ఈ రెండింటి కలయికతో చెట్ల మొక్కల ఆకులలో పచ్చదనము వచ్చును.

**వృక్షములు పొడవుగా బలంగా ఎప్పుడుండును?**

భూమినుండి రసముపైకి ప్రసరించునపుడు చెట్లు పెరుగును. వంకరగా ప్రసరించునపుడు బలంగా ఉండును. ఇదొక వనస్పతి విజ్ఞానము. ఈ విషయము ఒక వేదమంత్రములో స్పష్టముగా ప్రతిపాదించబడినది.

**'ప్రమాతుః ప్రతరమ్ గుహ్యమిచ్ఛన్'**

ఈ ఋగ్వేద మంత్రములోని 'ప్రతరమ్' అను శబ్దము భూమిలోని రసము ఎంత పుష్టి కలది, శక్తికలదగునో అంతగ చెట్టు పెరుగునని చెప్పుచున్నది.

## వేదము - జ్యోతిషము

ఆర్యసమాజ తృతీయ నియమము- 'వేదము సమస్త సత్యవిద్యల పుస్తకము'. వేదమును చదువుట - చదివించుట, వినుట - వినిపించుట, ఆర్యులందరి పరమధర్మము అని చెప్పుచున్నది. నిజంగానే వేదము సమస్త సత్య విద్యల పుస్తకము. వేద శబ్దముతోనే వేదము నిశ్చయముగా

జ్ఞానభండారమని తెలియుచున్నది. వేదములలో ఒక దానిని మించి మరొ జ్ఞానము నిండి ఉన్నదని విద్వాంసులంతా అంగీకరింతురు. కానీ వాటి తెలుసుకొనగలవారు కావలయును. వేద జ్ఞానము సముద్రము వంటిది సముద్రములో ఒకదానిని మించి మరొకటి విలువైన రత్నములు నిండియున్నవి వానిని వెలికి తీయగలిగిన వారు కావలయును. వేదములలో వర్ణింప వస్తువేదీ ప్రపంచంలో లేదు. "ఋగ్వేదాది భాష్య భూమిక"లో "వేదవిషయ విచారమ"ను విషయములో ఋషి దయానందుడు యిట్లు వ్రాసిరి-

***"అత్ర చత్వారో వేద విషయాః సన్తి । విజ్ఞాన కర్మోపాసనా జ్ఞానకాండ భేదాత్ తత్రాదిమో విజ్ఞాన విషయో హి సర్వేభ్యో ముఖ్యోऽస్తి । తస్య పరమేశ్వరాదారభ్య తృణపర్యన్త పదార్థేషు సాక్షాద్ బోధాన్వయాత్ ।"***

అనగా: "వేదములలోని విషయములు-నాలుగు. అవి 1. విజ్ఞానకాండ 2. కర్మకాండ 3. ఉపాసనా కాండ 4. జ్ఞాన కాండలు. వీటన్నింటిలో విజ్ఞానకాండ ముఖ్యమైనది. దీనిలో పరమేశ్వరునితో మొదలై తృణము (గడ్డి) వరకు గల పదార్థములన్నింటి సాక్షాత్ జ్ఞానము లభించును."

పరమేశ్వరునితో మొదలై తృణము వరకుగల పదార్థములనిన- సృష్టిలోని అన్ని పదార్థములు, అన్ని విద్యలు ఉండును. ఇంతకంటె వేరుగా ఏవీ ఉండవు. కావున దీని అభిప్రాయమేమనగా వేదములలో సృష్టిలోని అన్ని పదార్థముల అన్ని విద్యల వర్ణన లభించును. కావున ఎవరికి కావలసిన దానిని వారు తీసుకొనవచ్చును. నేటి ఆధునిక యుగంలో ఏ విద్వాంసుడైనా తనలోని అవిద్యాంధకారమును పారద్రోలి జ్యోతిని వెలిగించినచో ప్రపంచములో తానొక క్రొత్త విషయమును కనుగొన్నానని అనుకొనును. ఇతర సాధారణ జనులు కూడా ఈ విద్వాంసుడు క్రొత్త విషయమును కనుగొనెనని, ఈ విషయమును గూర్చి యింతకు ముందు ఎవరకూ తెలియదని అనుకొందురు. ఇది వారి తప్పు. వైదిక యుగములో ఒకప్పుడు ఈ జ్ఞానమంతా వెలుగులో ఉండెను. (ప్రజలకు తెలియును) క్రమేణ కాల గర్భంలో అది అజ్ఞానాంధకారాలతో కప్పబడి ఆ ప్రకాశము కనుమరుగైనది. నేటి విద్వాంసుడు ఈ యుగంలో అజ్ఞానాంధకారమును పారద్రోలి ఆ విషయమును మరల క్రొత్తగా కనుగొని

మాటమాత్రం సత్యం. కాని ఇంతకు ముందెన్నడు ఈ విషయమును గూర్చి ఎవరికీ తెలియదనుట మాత్రము అనుచితము.

**(అ) సప్త రంగుల కిరణములు**

సూర్యకిరణాలలో ఏడు రంగులుండునను విషయమును అందరికంటె ముందుగ న్యూటన్ మహాశయుడు 16వ శతాబ్దములో కనుగొనెనని అంతవరకూ ఈవిషయము ఎవరికీ తెలియదని పాశ్చాత్య విద్వాంసులతోపాటు ప్రాచ్య విద్వాంసులు కూడా చెప్పుచుందురు. ప్రపంచములోని మొట్టమొదటి సాహిత్యమైన వేదములలో సూర్యుని కిరణాలలో గల ఏడురంగుల వర్ణన ఎంతో చమత్కారముగా వర్ణింపబడినదని వీరు తెలుసుకొనుట అవసరము. ఉదాహరణకు :

*మం॥ సప్త త్వా హరితో రథే వహన్తి దేవ సూర్య । శోచిష్కేశం విచక్షణః ॥*

*(ఋ. 1-50-9)*

అనగా : హే సూర్య! రథమునకు కట్టియున్న ఏడు గుర్రములు (కిరణములు) నిన్ను తీసుకువెళ్ళుచున్నవి.

*మం॥ ఏకో అశ్వో వహతి సప్తనామా ।*

*(ఋ. 1-164-2)*

అనగా: సూర్యుని ఒక గుర్రము తీసుకువెళ్ళుచున్నది. దానికి ఏడు పేర్లున్నవి.

*మం॥ 'అవ దివస్తారయన్తి సప్త సూర్యస్య రశ్మయః ।'*

*(అథర్వ 17-10-17-1)*

అనగా : సూర్యుని ఏడుకిరణాలు దినమును ఉత్పన్నము చేయుచున్నవి. ఈ వేదమంత్రముల ద్వారా సూర్యునకు ఏడురంగుల కిరణములున్నట్లు స్పష్టమగుచున్నది. ఏలయనగ సంస్కృత సాహిత్యములో సూర్యునకు 'సహస్ర రశ్మి' అని పేరు. కనుక సూర్యునకు ఏడు కిరణములుండుట అసంభవము. కావున పై మంత్రములో ఏడు కిరణములనగా ఏడు రంగులతో కూడిన కిరణములనే అభిప్రాయము. కిరణములలో గుర్రములను రూపకాలంకారముతో వర్ణింపబడినది. సూర్యుని ఒక గుర్రము తీసుకు వెళ్ళుచున్నది.

కాని దానికి ఏడు పేర్లున్నవి అనిన తాత్పర్యమేమనగా : సూర్యుని కిరణా ప్రకాశము తెల్లగానే కనబడినా దానిలో ఏడురంగులు కలిసి ఉండును. విషయమును నిరూపించుటకై విద్యార్థులకు పాఠశాలలలో ఒక ప్రయోగము చూపుదురు. ఒక గుండ్రని కాగితంపై ఏడురంగులు వేరువేరుగా వేసి కాగితమును చక్రమునకతికించి వేగముగా త్రిప్పుదురు. వేగంగా తిరుగునంతసే ఆ ఏడు రంగులు కలిసి తెల్లరంగుగా కనబడును. ఇదే విధంగా సూర్యు కిరణాలలో కూడా ఏడు రంగులున్నవి. సూర్యుడు ఒక ఇరుసుపై ఎంత వేగంగా తిరుగుచున్నాడు. వేగంగా తిరుగుచున్నందున ఆ ఏడు రంగుల తెలుపు రంగుగా మారి ఒకే తెలుపు రంగు మనకు కనబడుచుండును సూర్యుని కిరణాలలో ఉన్న రంగుల వర్ణన ఛాందోగ్యోపనిషత్తులో కలదు.

***'అసౌ వా ఆదిత్యః పింగల ఏషశుక్ల ఏషనీల ఏష పీత ఏష లోహితః।***

***(ఛాందోగ్య. 8-6-1)***

సూర్యుని రంగు తెలుపు. కాని వాస్తవమునకు అవి : 1. నీలము 2. పసుపు 3. ఎరుపు. ఛాందోగ్యోపనిషత్తులో మూడు రంగుల పేర్లే కలవు. ఇదే సత్యము. అసలు రంగులు మూడే. ఈ మూడింటి కలయికతో మిగిలిన రంగులన్నీ తయారగుచున్నవి.

ఎరుపు నీలము రంగులు కలసి ఊదారంగు

నీలము పసుపు రంగులు కలసి ఆకుపచ్చరంగు

ఎరుపు పసుపు రంగులు కలసి నారింజరంగు యిట్లే ఇతర రంగులు కూడా తయారగును.

సూర్యుని కిరణాలలోని ఏడు రంగులు చూడవలెనన్న ఇంద్ర ధనుస్సు మంచి సాధనము. నీటితో నిండిన మేఘాలలోనుండి సూర్యకిరణములు పయనించునపుడు ఆకాశంలో (ధనుస్సు) బాణము వంటి గుండ్రని ఆకారంలో ఏడు రంగులు వేర్వేరుగా కనబడును. దీనిపేరే 'ఇంద్ర ధనుస్సు'

**(ఆ) సూర్య - చంద్ర గ్రహణములు**

**మం॥ యత్త్వా సూర్య స్వర్భాను స్తమసా విధ్యదాసురః ।**

(ఋ. 5-40-1)

అనగా : 'హే సూర్య! నిన్ను స్వర్భాను అంధకారముతో కప్పివేయును. స్వర్భాను అసురుడు.' చంద్రుని నీడ సూర్యుని, భూమి నీడ చంద్రుని కప్పివేయును. ఈ నీడే అసురుడు - స్వర్భాను. చంద్రుని నీడ సూర్యుని కప్పివేసినపుడు-'సూర్యగ్రహణ' మేర్పడును. భూమినీడ చంద్రుని కప్పివేసినపుడు 'చంద్రగ్రహణ' మేర్పడును. నీడతో కప్పి వేయబడుట వలననే సూర్య చంద్రులు ప్రకాశింపరు. ఇవే 'సూర్య-చంద్ర గ్రహణములు'. అనగా అప్పుడు సూర్యుని ప్రకాశము భూమిపై పడదు.

శతపథ బ్రాహ్మణములో యిట్లు వ్రాసియున్నది-

*'స్వర్భానుర్హా అసురః సూర్యం తమసా వివ్యాధ,*
*స తమసా విద్ధోన వ్యరోచత'* ।

అనగా : రాహువు (చంద్రుని నీడ) సూర్యుని చీకటితో కప్పివేయును. చీకటి కప్పబడి యున్నందున సూర్యుడు ప్రకాశింపజాలడు.

చంద్రుని నీడ సూర్యుని, భూమి నీడ చంద్రుని కప్పివేసినపుడు అవి ప్రకాశింపవు. అనగా వానికి గ్రహణమేర్పడును. ఆ నీడ తొలగిపోగానే ప్రకాశించుటారంభించును. వేదానుకూలమైన ఈ వర్ణనే ఆధునిక జ్యోతిష గ్రంథములో లభించును. సూర్య సిద్ధాంత గ్రంథములో యిట్లు వ్రాసియున్నది.

*'ఛాదకో భాస్కర స్యేన్దు రధస్థో ఘనవద్ భవేత్ ।*
*భూచ్ఛాయాం ప్రాజ్ ముఖశ్చన్ద్రో విశత్యస్య భవేదసౌ* ॥

అనగా : చంద్రుడు క్రిందనుండి మేఘములవలె సూర్యుని కప్పివేయును. తూర్పు భాగమును భూమియొక్క నీడలో ప్రవేశింపజేయును.

సిద్ధాంత శిరోమణిలోని గోళాధ్యాయములో యిట్లు వ్రాసియున్నది-

*'పూర్వాభిముఖో గచ్ఛన్ భూచ్ఛాయాన్తర్యతః శశీ విశతి ।*
*తేన ప్రాక్ గ్రహణం పశ్చాన్మోక్షోz స్య నిస్సరతః'* ॥

చంద్రుడు తూర్పువైపునకు వెళ్ళుచూ భూమియొక్క నీడలోనికి వెళ్ళినపుడు పూర్వాంశములోచంద్రగ్రహణము జరుగును. నీడలోనుండి బయటపడునపుడు పశ్చిమాంశమునుండి చంద్రునకు విడుదల లభించును.

### (ఇ) చంద్రుని రెండు పక్షములు

చంద్రునకు రెండు పక్షములు ఏర్పడుచుండును. అవి శుక్ల, కృష్ణ పక్షములు. చంద్రుని ఈ రెండు పక్షముల వర్ణన వేదములో ఈ విధంగ ఉన్నది-

**'చంద్రమా అప్స్వంతరా సుపర్ణో ధావతే దివి ।'**

***(అథర్వ 18-4-89***

అనగా : చంద్రుడు ఆకాశములో పక్షివలె పరుగిడుచున్నాడు. పక్షికి రెండు రెక్కలుండును. చంద్రునకు కూడా రెండు పక్షములుండును. చంద్రుడు భూమికి నలువైపులా తిరుగుచుండును. చంద్రుడు భూమికి నలువైపుల తిరుగుచుండును. చంద్రుడు తిరుగుచూ - తిరుగుచూ ఏ దేశమునక ఎదురుగా వచ్చునో ఆ దేశంలో అదే సమయంలో చంద్రుడు కనబడును ఇందువలననే ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క దేశములో చంద్రుడు కనబడుచుండును. భూమిపైనున్న అన్ని స్థానములలో(దేశములలో) ఒకేసా చంద్ర దర్శనం జరుగదు. కాని రాత్రి కాలంలో కూడా శుక్లపక్షములగుటక కారణము చంద్రుడు శుక్లపక్షములో మనకు ముందు ఉండును. కృష్ణ పక్షములో ఉండదు. శుక్లపక్షములో చంద్రుడు మన ముందుకు వస్తున్నప్పుడు చంద్రుని కళలు కూడా పెరుగుచుండును. కృష్ణపక్షములో చంద్రుడు మననుండి దూరమగుచున్నపుడు చంద్రుని కళలు కూడా తగ్గుచుండును చంద్రునకు రెండు పక్షములు ఏర్పడుటకు కారణమిదియే. ఈ రెండు పక్షములను గూర్చి వేదములలో వర్ణన కలదు.

### (ఈ) రాలు నక్షత్రము

*మం॥ శన్నో భూమిర్వేప్యమానా, శముల్కా నిర్హతం చ యత్ ।*

***(అథర్వ. 19-9-7***

అనగా : తిరుగుచున్న భూమితో ఢీకొని ముక్కలైన ఉల్కలు - నక్షత్ర శకలములు - కాంతిపుంజములు మాకు ఎటువంటి నష్టమును కలుగజేయక శాంతి దాయకములగుగాక!

ఉల్క పిండము (ముద్ద) భూమికి పైన 16 నుండి 20 మైళ్ళ దూరములో నుండును. వీటి వేగము 1 సెకనుకు 18 మైళ్ళనుండి 40 మైళ్ళు. భూమికూడా 1 సెకనుకు 18 మైళ్ళ వేగంతో అతి వేగంగా సూర్యుని చుట్టూ నలువైపులా తిరుగుచుండును. ఉల్కాలు తిరుగుచూ తిరుగుచూ భూమి తిరుగు మార్గము (కక్ష్య) లోనికి వచ్చినపుడు భూమితో రాసుకొని ముక్కలు ముక్కలగును. ఈ పని రాత్రింబవళ్ళు అంతరిక్షంలో జరుగుచుండును. ఉల్కాలు భూమిని రాసుకొన్నపుడు మెరుపు పుట్టును. సూర్యుని కాంతిలో ఈ మెరుపు కనిపించదు. రాత్రులందే కనిపించును. భూమ్యాకర్షణశక్తి వలన అవి భూమి వైపునకు వచ్చును. ఉల్కాపాతము జరుగునపుడు ఉల్కాల పెద్ద-పెద్ద శకలములు (ముద్దలు) విరిగి భూమిపై పడును. ఈ ఉల్కాలు ఎన్నో వందల మణుగుల బరువుండును. ఈ ముద్దలలో రాళ్ళు, లోహము, కార్బను (బొగ్గు) మున్నగునవి ఉండును. ఇవి పడుట వలన ప్రాణులకు చాలా నష్టము కలుగును. కనుక వేదములో ఇవి శాంతిదాయకములు కావలయునని పరమేశ్వరుని ప్రార్థించుట కలదు.

**(ఉ) పంఛులా నక్షత్రము (తోకచుక్క)**

17వ శతాబ్దంలో న్యూటన్ మహాశయుడు మొట్టమొదటిగా ఆకాశంలో కేతు (పంఛులా) నక్షత్రములు కూడా కలవని కనుగొన్నట్లు పాశ్చాత్య విద్వాంసులు చెప్పుచుందురు. కానీ అతి ప్రాచీన సాహిత్యమైన వేదములలో వీటిని గూర్చి ముందుగానే వర్ణన కలదు.

*మం॥ హరయో ధూమకేతవో వాతజూతా ఉపద్యవి ।*
*యతన్తే వృథగగ్నయః ॥*

**(యజు. 33-2)**

*శన్నో మృత్యు ర్ధూమకేతుః శం రుద్రాస్తిగ్మతేజసః ॥*

**(అథర్వ. 19-9-10)**

ఈ రెండు వేదమంత్రములలో ధూమకేతు అనగా 'పంఛులా' తారల పేర్లున్నవి. ధూమకేతు మాకు శుభములనిచ్చుగాక! అని పై వేదమంత్రంలో ప్రార్థన కూడా చేయబడినది. కేతువు-పృథివి రెండు తిరుగుచుండును. అప్పు

దప్పుడు తిరుగుచున్న భూమి కేతువు తోక మధ్యలో నుండి వెళుతూ దానిత ఢీకొనుట వలన ముక్కలై భూమిపైపడును. ఉల్కల ముద్దలవలె ఈ ముక్క లో కూడా రాళ్ళు, లోహము, సీస ము మున్నగు పదార్థములుండును. వీటి వలన ప్రాణనష్టము జరిగి భయంకూడా కలుగుచుండును. అందువల్ల వేదములో మానవ కల్యాణమునకై ప్రార్థన కలదు.

వేదములలో జ్యోతిషవిద్య ముందునుండే పూర్ణముగా కలదని నిరూపించుటకు ఈ ఉదాహరణలు చాలును. న్యూటన్ మున్నగు పాశ్చాత్య విద్వాంసులు ఎవరూ క్రొత్తగా కనిపెట్టినదేమీ లేదు. సూర్య గ్రహణము, చంద్రగ్రహణము, ఉల్కాపిండములు, ధూమకేతువు మున్నగు వాని వాస్తవిక స్వరూపం కూడా పై వేదమంత్రముల ద్వారా తెలియును. ప్రకృతి రహస్యములను తెలియని సామాన్య ప్రజలు సూర్యచంద్ర గ్రహణములేర్పడినపుడు 'రాహువు' అను రాక్షసుడు సూర్యచంద్రులను మ్రింగి వేయునని, వారిని కష్టపెట్టునని తలంచు చుందురు. వారి దుఃఖములను దూరముచేయుటకై దానములు చేయుచుందురు. ఉల్కాలు పడునపుడు యమధర్మరాజు భటులు మరణించిన వారి ప్రాణములను పాశమువేసి లాగుచున్నట్లు కల్పితకథలను చెప్పుచుందురు. కానీ వేదమంత్రములు సూర్య-చంద్ర గ్రహణములను, ఉల్కాపాతములకు కారణాలను వాస్తవముగా వర్ణించుచున్నవి. ఈ విధంగా వేదములలో జ్యోతిష విద్యను గూర్చి సంపూర్ణ జ్ఞానమున్నట్లు తెలియుచున్నది.

## వేదము - ధనుర్విద్య

ధనుర్విద్యకు సంబంధించిన కొన్ని భాగములను గూర్చి ప్రచారము నేటికిని భారత దేశంలో తప్ప బహుశా మరే యితర దేశములోనూ లేదనవచ్చును. ఇచ్చట కూడా ముందున్నంత ప్రచారము మరియు ధనుశ్శాస్త్ర నిపుణతలకు సంబంధించిన అంశములు మిగిలి లేవు. శబ్ద వేధి బాణములతో శత్రువులను ఈ దేశవీరులు ఓడించుచుండిరి. పృథ్వీరాజ్ చౌహాన్ శబ్దవేధి బాణముతో మహమ్మద్ ఘోరీ ప్రాణములు తీయుట ప్రపంచమంతటికి తెలిసినదే.

పైన వ్రేలాడగట్టిన మత్స్యముయొక్క నీడను క్రింద ఉన్న నూనెలో చూచి పైన తిరుగుచున్న ఒక చక్రపు మధ్యలోనుండి ఆ వ్రేలాడుచున్న మత్స్యమును కొట్టగలుగుట ఇచ్చటి ధనుర్విద్యా విశారదులకు తప్ప మరెవరికి సాధ్యము? శత్రువును చంపి తిరిగి వెనుకకు వచ్చునట్టి శస్త్రములను ప్రయోగించగల నైపుణ్యము కలిగిన ధనుర్విద్యా విశారదులు యిక్కడగాక మరెక్కడ ఉందురు? గుండ్రని ఆకారంలోనున్న ఏడు వృక్షములను ఒకే బాణంతో ఒకేసారి నరకుట యిచ్చటి ధనుర్విద్యా వీరుల నైపుణ్యము. ఒంటరిగా వందమంది శత్రువులతో యుద్ధముచేయగల ధనుర్విద్యాకౌశల్యము కల వీరులు యిచ్చట ఉండెడివారు.

భారతీయులలో ఈ విద్యకు సంబంధిచిన జ్ఞానము వేదముల నుండే లభించినది. వేదముల ప్రచారము మొదట భారతదేశంలో ఉన్నంత ఎక్కువగా ఇతరదేశాలలో లేకుండెను. ఇందువలననే మొదట అన్ని దేశాలకంటె భారతదేశం ఉన్నతినొంది ఫిరంగులు, తుపాకులు, ధనుర్బాణములు మున్నగు వానిని వేదముల ఆధారంతో తయారుచేయుచుండిరి. రామాయణ మహాభారతములలో ఈ అస్త్ర-శస్త్రములను గూర్చి అనేక స్థానములలో గల వర్ణనల ద్వారా ఇవి భారతదేశంలో తప్ప మరే దేశంలోను అంతకుముందు లేవని తెలియుచున్నది. వీటిని అందరికంటె ముందుగ భారతీయులు కనుగొనిరి. భారతీయుల విజ్ఞానము యితరదేశ వాసులందరి విజ్ఞానము కంటె విస్తృతము, గొప్పదని చెప్పుటకు యితర అధునిక గ్రంథముల సాక్ష్యమిచ్చుట వ్యర్థము. అది సూర్యుని దీపముతో చూచుట వంటిదే. ధనుర్విద్యలో ధనుస్సు, బాణములు, ఫిరంగులు, తుపాకులు, కత్తులు, కటారులు, బరిసెలు మున్నగు వాని అన్నింటిని గూర్చి యుండును. వీటన్నింటిలోను ధనుర్విద్య ముఖ్యమైనది. కనుకనే ఈ విద్యకు ధనుర్విద్యయని పేరువచ్చినది. వేదములలో ధనుర్విద్య వర్ణనను గూర్చి సంక్షిప్తముగా యిచ్చుట తెలియజేసితిమి.

(అ) యుద్ధభూమి వర్ణన

మం॥ నమో విసృజద్భ్యో విధ్యద్భ్యశ్చ వో నమో
నమః స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చ వో నమో ।
నమః శయానేభ్య ఆసీనేభ్యశ్చ వో నమో
నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చ వో నమః ॥

(యజు. 16-23)

శత్రువులపై బాణములు విడుచు వారికి శత్రువులను వేధించు వారి నమస్కారము. యుద్ధ డేరాలలో నిద్రించువారికి లేదా యుద్ధభూమిల గాయపడి పరున్నవారికి మరియు కాపలాకాయు ఓ పురుషులారా! మీక ఆదరము లభించుగాక! నిద్రించు వారు, నిలిచియున్నవారు, పరుగిడు వారి కూడా ఆదరమునకు తగిన స్థానము లభించుగాక!

ఈ మంత్రములో యుద్ధభూమి యొక్క సుందర చిత్రము వర్ణింపబడినది యుద్ధభూమిలో కొందరు శత్రువులపై బాణములను విడుచుచుందురు కొందరు శత్రువులను చంపుచుందురు. కొందరు యుద్ధము సమాప్తమైన తరువాత డేరాలలో నిద్రించుచుందురు. కొందరు గాయపడి యుద్ధభూమిల పడి యుందురు. మరికొందరు కోట బురుజులపై నిలబడి ఉంటే మరికొందరు ఇటునటు పరుగెత్తుచు తిరుగుచుందురు. వీటన్నింటిని గూర్చి ఈ మంత్రములో చక్కగా వర్ణించబడినది. దీనితో పాటుగ ఎంతో మహత్త్వ పూర్ణమైన యుద్ధనీతి సంబంధించిన విశేష విద్యలు కూడా ఈ మంత్రములో లభించును.

1. శత్రువులు రాత్రిపూట మోసముతో ఆక్రమణ చేయకుండుటకై రాత్రి తమ డేరాలను కాపలాకాయుట.

2. యుద్ధము తరువాత నిద్రించి-విశ్రాంతి తీసుకొన్నచో మరునాడు యుద్ధంలో తొందరగా అలసిపోము. కనుక యుద్ధము తరువాత విశ్రాంతి తీసుకొనుట.

3. శత్రువు మనకంటె ఎక్కువ బలవంతుడైనచో పారిపోవలయును గాని వ్యర్థముగా ప్రాణములు విడువరాదు. అనే యుద్ధరహస్యాలెన్నో వేదమంత్రంలో కలవు.

(అ) ఆయుధముల సామాన్య వర్ణన

మం॥ *స్థిరా వః సన్త్వాయుధా పరాణుదే వీలూ ఉతప్రతిష్క భే ।*

*(ఋ. 1-3-18-2)*

స్వామీ దయానందుడు ఈ మంత్రమునకు అర్థము ఈ విధముగా వ్రాసిరి-

"ఓ జీవులారా! ఈ ఆయుధములు అనగా ఫిరంగులు తుపాకులు, ఖడ్గములు, బరిసెలు మున్నగు శస్త్రములు మీ కొరకు స్థిరముగను దృఢముగ నుండునుగాక! అని ఈశ్వరుడు జీవులందరినీ ఆశీర్వదించును. దేనికొరకు? అనిన నీ శత్రువులను పరాజయులుగ చేయుటకు. దుష్టులైన శత్రువులు నీకెన్నడు దుఃఖమును కలిగించ కుండుటకు, శత్రువుల వేగమును నిరోధించుటకు అని సమాధానము."

వేదములో ఫిరంగులు, తుపాకులు, ధనుస్సులు బాణములు మున్నగు ఆయుధములన్నింటి వర్ణన కలదని దీనితో స్పష్టమగుచున్నది. శత్రువులనుండి తమను తాము కాపాడుకొనుటకు, దుష్టులైన శత్రువులను పరాజయులను చేయుటకు ఈ ఆయుధములు ఉపయోగపడునని కూడా సూచించబడున్నది.

(ఇ) ఫిరంగులు తుపాకులు ధనుస్సు

మం॥ *జిహ్వా జ్యా భవతి కుడ్మలం వాఙ్నాలీకాదంతా స్తపసామిదాగ్ధాః ।*
*తేభి ర్బ్రహ్మా విధ్యతి దేవపీయూన్ హృద్బలైర్ధనుభిర్దేవ జూతైః ॥*

*(అథర్వ. 5-18-8)*

దేవతలను విరోధించు వారిపై ప్రయోగింపబడిన, జ్ఞానులు విద్వాంసులైన బ్రాహ్మణుల జిహ్వాధనుస్సు త్రాడువలె పనిచేయును. వాక్కు ధనుస్సు యొక్క చివరిభాగము వలె, పండ్లు తుపాకులలోని గుండ్లవలె హృదయబలము ధనుస్సు వలె పనిచేయును.

ఈ మంత్రములో ధనుస్సు యొక్క దారము ధనుస్సు యొక్క చివరి భాగం, తుపాకీ గుండ్లు మున్నగు వాని పేర్లు కలవు. ఇచ్చటనున్న 'నాలీకాః' శబ్దమును గూర్చి విశేషముగా తెలుసుకొనవలయును. మహాభారతము,శుక్ర నీతి మున్నగు వానిలో తుపాకులు, ఫిరంగుల వర్ణన 'నాలీకా' అను పేరుతో

కలదు. తుపాకీ పేరు 'లఘునాలీక' ఫిరంగి పేరు 'బృహన్నాలీక.' చాలామంది పాశ్చాత్య సభ్యతా వ్యామోహముతోనున్న పరిణామ వాదులు వైదిక యుగములో ఫిరంగులు, తుపాకులను తయారు చేయుట భారతదేశములోని ప్రాచీన ఆర్యులకు తెలియదనుకొనుచుందురు. కానీ వేదములో యిటువంటి మంత్రములను చూచినపుడు ప్రాచీన ఆర్యులు సభ్యత తెలియని వారను తమ అభిప్రాయమును వారు సర్వదా విడువ వలయును.

(ఈ) సీసపు గుండ్లు

*మం॥ సీసామాధ్యాహ వరుణః సీసామాగ్ని రూపావతి ।*
*సీసం మ ఇంద్రః ప్రాయచ్ఛత్ తదంగ యాతుచాతనమ్ ॥*

*(అథర్వ 1-16-2)*

వరుణుడు (ఋషి) శత్రువులను నాశనమొనర్చుటకై సీసపుగుండ్లను ఉపయోగించవలయునని ఉపదేశించును. ఆత్మరక్షణకై సీసపుగుండ్లను ఉపయోగించవలయునని అగ్ని (ఋషి) మనకు ఉపదేశించును. ఇంద్ర ఋషి కూడా దుష్టులైన శత్రువులను నాశనమొనర్చుటకై సీసపు గుండ్లనే నారక్షణకై ఇచ్చెను.

*మం॥ యది నో గాం హంసి యద్యశ్వం యది పూరుషమ్ ।*
*తంత్వా సీసేన విధ్యామో యథా నోऽ సౌ అవీరహా ॥*

*(1-16-4)*

' నీవు మా గోవులను, గుఱ్ఱములను, మనుష్యులను చంపినచో నిన్ను తుపాకీ గుండ్లతో చంపుదుము. అలాంటప్పుడు నీవు మా వీరులను చంపజాలవు. ఈ పై రెండు మంత్రాలలో సీసపు గుండ్ల పేరు స్పష్టముగానున్నది. సీసము పెద్ద - పెద్ద గుండ్ల రూపములో వాడుటకు వీలుండదు. దానిని చిన్న గుండ్ల రూపములో చేసి వాడవచ్చును. శత్రువులను చంపుటకు, శత్రువులనుండి తనను తాను రక్షించుకొనుటకు సీసపు గుండ్లు ఉపయోగము చెప్పబడినది. శత్రువులను గుండ్లతో చంపవలయుననుట వలన సీసపుగుండ్లను దూరమునుండి విసరవలయును. దగ్గరనుండి గుండ్లను విసిరినచో అవి గ్రుచ్చుకొనవు. గుండ్లు తుపాకీతోనే వేగంగా దూసుకొనిపోయి గుచ్చుకొనును. ఈ విధంగా

వేదమంత్రములలో సీసపు గుండ్లతో పాటుగ తుపాకీ ప్రయోగము కూడా చెప్పబడినది.

(ఉ) ధనుస్సుతో దిగ్విజయము

మం॥ ***ధన్వనా గాం ధన్వనా జిం జయేమ ధన్వనా తీవ్రాః***
***సమదా జయేమ । ధనుః శత్రోరపకామం***
***కృణోతి ధన్వనా సర్వాః ప్రదిశో జయేమ ॥(యజు. 29-39)***

ధనస్సుతో గోవులు మున్నగు పశుసంపదను జయించెదము గాక! ధనుస్సుతో యుద్ధములో విజయమును పొందుదుము గాక! ధనుస్సుతో క్రూరుడు, మొండియైన శత్రువును జయించెదము. ధనుస్సు శత్రువునకు హానిచేయును. ధనుస్సుతో నలుదిశలా జయించెదము గాక!

ఈ వేదమంత్రములో ధనుస్సును గూర్చి వర్ణించుటతోపాటు ఆధనుస్సుతో ఏమేమి చేయగలమో కూడా సూచించబడినది. ధనుస్సుతో దిగ్విజయమును పొందగలుగుదుమని చెప్పబడినది.

**(ఊ) బాణము మేలుచేయును గాక!**

మం॥ ***యత్రా-నరః సం చ వి చ ద్రవంతి తత్రాస్మభ్య***
***మిషవః శర్మ యగ్ంసన్ ।           (యజు. 29-48)***

ఏ యుద్ధములో మనుష్యులు ఇటు-నటు పరుగెత్తుచుందురో అచ్చట బాణములు మాకు శుభమును కలిగించును గాక!

ఈ వేదమంత్రములో బాణములు మాకు శుభమును కలిగించవలయునని పరమేశ్వరుని ప్రార్థన చేయబడినది. యుద్ధభూమిలో వీరులు శత్రువులను చంపుటకు లేక వీరులైన శత్రువులనుండి తమను తాము రక్షించుకొనుటకు బాణములను ప్రయోగింప వచ్చును.

మం॥ ***విజ్యాం ధనుః కపర్దినో విశల్యో బాణవాన్ ఉత ।***
***అనేశన్నస్య యా ఇషవ ఆభురస్య నిషంగధిః ॥***
***(యజు. 16-10)***

జటాధారియైన వీరుని ధనుస్సు తాడు లేకుండా ఎప్పుడైనా ఉంటుందా?

ఉండదు. అమ్ములు పొది ఎప్పుడైనా బాణములు లేకుండా ఉండునా? ఉండదు. దీనిలోని బాణములు ఎన్నడైనా నాశనమగునా? కావు. ఖడ్గము ఒర ఎప్పుడైనా ఖాళీగా ఉండునా? ఉండదు.

వీరపురుషుని దనుస్సునకు నారి ఎల్లప్పుడు ఉండవలయును. అట్లే అమ్ములి పొది ఎన్నడూ ఖాళీగా ఉండరాదు. ఖడ్గపు ఒర ఎన్నడూ కత్తిలేకుండా ఉండరాదు. అనగా వీరపురుషుని వద్ద ఎల్లప్పుడూ ఖడ్గముండ వలయును. ఈ విధంగా ఈ మంత్రములో ధనుస్సు, ధనుస్సునారి, బాణములతో పాటుగ అమ్ములపొది ఖడ్గముల ఒరల వర్ణనకూడా కలదు. ఆరోజులలో బాణములనుంచుటకు అమ్ములపొది, ఖడ్గముల నుంచుటకు కావలసిన ఒరలను గూర్చి కూడా వర్ణన కలదు. దీనినిబట్టి ప్రాచీన ఆర్యులు ఆధునిక సభ్యతకు జన్మదాతలని తెలియుచున్నది.

ఈ వేదమంత్రములలో ధనుస్సు, బాణము, తుపాకులు, సీసపుగుండ్లు, అమ్ములపొది, ఖడ్గపు ఒర మున్నగువాని వర్ణనలు కలవు. ధనుర్విద్య ముందుగ వేదములనుండే ఆరంభమైనదని ఈ వర్ణనలు నిరూపించుచున్నవి. వేదములలో అనేక స్థలములలో అనేక మంత్రములలో ఈ విషయములు కలవు. ఇంతకంటె ఎక్కువ ధనుర్విద్య వర్ణనలు కూడా వేదమంత్రాలలో కలవు.

## వేదములలో ప్రయాణ సాధనలు

ప్రతి క్షణము ప్రపంచము మార్పుచెందుచు ప్రతిరోజు ప్రపంచము ఉన్నతి చెందుచున్నదని, ప్రాచీన నాగరికతల సభ్యతలకంటె ఆధునిక నాగరికత సభ్యతలు అభివృద్ధి చెందినవని చెప్పు పరిణామవాదుల సిద్ధాంతము యుక్తితో కూడినది కాదు.

మహర్షి దయానందులు ఋగ్వేదాది భాష్యభూమికలోని పఠన పాఠన విషయంలో ఈ విధంగా వ్రాసిరి.

(యద్యత్ కించిత్ భూగోళమధ్యే పుస్తకాంతరేషు హృదయాంతరేషువా సత్యవిద్యా విజ్ఞాన మభూత్ భవతి, భవిష్యతి చ తత్సర్వం వేదాదేవ ప్రసృతమితి విజ్ఞేయమ్)

అనగా : 'భూగోళమంతటా పుస్తకాలలోను, ప్రపంచములోని మానవుల హృదయాలలోగల సత్యవిద్య లేక విజ్ఞానము ఇప్పటివరకు ఉన్నది, ఇప్పుడున్నది, ఇకముందు ఉండబోవునది అంతా వేదమునుండే పుట్టినది. ఇకముందు కూడా వేదమునుండే పుట్టును.' అని అర్థము. కాని నేటి పరిణామ వాదులు మోటార్లు, రైళ్లు, ఓడలు, విమానములు మున్నగు యాత్రల సాధనములను కూడా నవీన వికాసము యొక్క పరిణామముగ తలంచుచుందురు. ఈ వాహనములు ప్రాచీనకాలములో లేవని వీనిని కనుగొన్న పరిశోధకులు కూడా ఆధునికులేయని వీరు తలంచు చుందురు. "ఈజిప్టు దేశమునకు చెందిన సికందరియా నగరంలో నివసించే హీరో అను పేరుగల వ్యక్తి 2వేల సం॥రం ల క్రిందట ఆవిరి ఇంజన్‌ను కనుగొనెను. అది మార్పుచెందుతూ నేటి రైలుబండి రూపమును దాల్చినది. ఇంతకు పూర్వం రైలుబండి అనేపేరు కూడాలేదు. మోటారు బండిని గూర్చి ఆలోచన అందరికంటె ఇంగ్లండుకు చెందిన జార్జి కైలీ చేసెను. క్రీ. సం. 1733 లో ఇంగ్లండులో జానే థన్ హల్ అనునతడు ఆవిరితో నడిచే నౌకను పేటెంటు చేయించెను. (తాను కనుగొనినట్లు ప్రకటించుకొనెను.) గాలిలో ఎగురుటకు ఫ్రాంసులో మౌంట్ గాల్ఫియర్ అను పేరుగల ఇద్దరు సోదరులు మొట్టమొదటిగ 1782 సం॥రం లో ఒకరకమైన గాలి గుమ్మటమును (BALOON) చేసెను. ఇంతకుముందు గాలిలో ఎగురుటకు ఎటువంటి యానము(నౌక)లేనేలేదు" అనుకథలెన్నో వికాసవాదులు చెప్పుచూ నేటి ప్రయాణసాధనములన్నీ ఈ నవీన యుగములోనే కనుగొనబడినవని, ఇంతకు ముందెన్నడూ వీని జ్ఞానము కూడా ఎవరికీ లేదని చెప్పుచుందురు. కానీ ప్రపంచములోని ఆదిజ్ఞానమైన వేదములను స్వాధ్యాయముచేసినచో ఈ ప్రయాణ సాధనములన్నీ వేదముల జ్ఞానముతోనే ప్రపంచములో తయారుచేయబడినవని, వాటిని తయారుచేయు జ్ఞానమంతా వేదములలో కలదని తెలియును.

**(అ) మూడు రకముల రోడ్లు**

ప్రాచీన కాలంలోని నగరములలో అనేక రకముల వాహనములు తిరుగుటకై వేర్వేరుగ రోడ్లుండెడివి. ఈ విషయమును నిరూపించుటకై అథర్వ

వేదంలో-

మం॥ *యే తే పంథానో బహవో జనాయనా*
*రథస్య వర్త్మానసశ్చ యాతవే ।*
*యైః సంచరంత్యుభయే భద్ర పాపాస్తం*
*పంథానం జయేమాన మిత్ర మతస్కరం*
*యచ్ఛివం తేన నొమ్మృడ ॥* **(అథర్వ. 12-1-47)**

ఈ వేద మంత్రంలో మూడు రకాల రోడ్లపేర్లున్నవి. 1. జనాయన 2. రథవర్త్మ 3. అనోవర్త్మ అను మూడు రకాల రోడ్ల వర్ణన కలదు. అనగా ఒకరకమైన రోడ్డుపై కేవలము మనుష్యులే నడవగలుగుదురు. రెండవ రోడ్డుపై కేవలం రథములే నడువగలవు. మూడవ రోడ్డుపై ఎద్దుబండ్లే నడువగలవు. ఈ విధంగా ఈ వేదమంత్రములో రోడ్ల వర్ణన ఎంతో సుందరముగా విభజింపబడినది. మనుష్యులు నడచుటకు ఎటువంటి అడ్డూ లేకుండా రథములు మున్నగు వాహనములేవీ ఢీకొని ప్రమాదములు జరుగకుండా మనుష్యుల రోడ్లు వేరు చేయబడినవి. వేగముగా నడచు రథాలు అనగా మోటర్లు మున్నగువాహనాలతో ఎక్కడా ప్రమాదాలు జరుగకుండా యుండుటకై ఎడ్లబండ్ల రోడ్లు వేరుగా వేయబడినవి. రథములు, వేగముగా నడచు యితర మోటార్లు మున్నగు వాహనాలు నడుచునపుడు ఎద్దుబండ్లు, మనుష్యులు అడ్డుతగిలి ప్రమాదములు జరుగునను భయముతో వాని వేగమును తగ్గించు అవసరము లేకుండా రథములు మున్నగు వేగముగా నడుచు వాహనముల రోడ్లు వేరుగా వేయబడెను.

వేదములలో ఎద్దుబండ్లు, గుఱ్ఱపుబండ్లను గూర్చి అనేక స్థలములలో వర్ణన కలదు. అనేక గుర్రములతో కూడిన గుర్రపు బండ్లను గూర్చి వర్ణన కూడా కలదు.

**(అ) వాయువేగముతో నడుచు రథములు (మోటర్లు)**

మం॥ *వాతరం హా భవ వాజిన్ యుజ్యమాన*
*ఇంద్రస్యేవ దక్షిణః శ్రియైధి ।*
*యుంజన్తు త్వా మరుతో విశ్వవేదస ఆతే*
*త్వ ష్టాపత్సు జవం దధాత్ ॥* **(యజు. 9-8)**

యజుర్వేదములోని ఈ మంత్రములో-

ఓ వేగవంతమైన పదార్థమా! నీవు యంత్రములో ఉపయోగింపబడి వాయువేగముతో నడువుము. నీవు బలవంతమైన విద్యుత్ కాంతితో మెరయుచుండుము. జ్ఞానులు విద్వాంసులు నిన్ను ఉపయోగించెదరు. శిల్పి (యంత్రకర్త) నీ కాళ్ళలో (చక్రములలో) చలనమును కలిగించునుగాక! అని చెప్పబడినది. ఈ మంత్రములో చెప్పబడిన వాయువేగముతో పోవుచు విద్యుత్ కాంతితో మెరయునట్టి రథము నేటిమోటరు వంటిదేయని భావించవచ్చును. వేదకాలములో ఇటువంటి మోటరును గూర్చి వర్ణన ఆశ్చర్యమును కలిగించును.

**(ఇ) క్రీడా రథము - కారు**

మం॥ *క్రీడం వః శర్ధో మారుతమనర్వాణం రథే శుభమ్।*
*కణ్వా అభిప్రగాయత ॥*

**(ఋ. 1-37-1)**

ఓ బుద్ధిమంతులారా! మీరు వాయువు ద్వారా పుట్టు బలమును స్తుతించుడు. దీనికి గుఱ్ఱములు మున్నగు వాని అవసరంలేదు. ఆ బలము రథము యొక్క శోభను పెంచునదియై ఆటలకు విశేష సాధనము వంటిది.

ఈ వేదమంత్రములో వాయువేగముతో పోవునది గుఱ్ఱములు మున్నగు వాని అవసరం లేనిది మరియు అది 'క్రీడ' అనగా ఆనందమునకు కారణమైనది అని కలదు. ఈ వేదమంత్రములో 'మారుత' శబ్దము కూడా వచ్చును. మా + రుత అనగా శబ్దము కానిది అని అర్థము. ఈ కారు నడచునపుడు శబ్దమే ఉత్తమమైనది.

(ఈ) వందలాది మనుష్యులు ప్రయాణము చేయు రథము (రైలుబండి)

మం॥ త్రిశోకః రథః కుత్సేనశతం నౄన్ అవహత్ ।

(అథర్వ. 20-76-2)

అథర్వ వేదములోని ఈ మంత్రములో కుత్స అను రథము వందలాది మనుష్యులను తీసుకు వెళ్ళునని చెప్పబడినది. ఒకేసారి వందలాది మనుష్యులను తీసుకొని పోగలుగు రథము నేడు ఏదీ కనబడదు. ప్రాచీనకాలము నాటి ఈ రథమునకు నేటి రూపమునిచ్చి తయారుచేసినచో అది ఒకేసారి వందలాది మనుష్యులను తీసుకొని వెళ్ళు నేటి రైలువంటిదే యగును. నేటి రైలులో కూడా ఒకే డబ్బాలో వందలాది మనుష్యులు కూర్చొనలేరు. కొన్ని డబ్బాలు కలిస్తేనే అంతమంది ప్రయాణముచేయుటకు వీలగును. కనుక వేదములోని ఈ రథస్వరూపమును నేటి రైలుబండితో పోల్చుకున్నచో వేదకాలమునాటి ఈ రథమువంటి రథమును నేటి వరకు వైజ్ఞానికులెవరూ నిర్మించలేక పోయిరని సిద్ధమగును.

(ఉ) విమానము

క్రీ॥ సం॥ 1782 వరకు గాలిలో (ఎగురుట) ప్రయాణించుట ఎవరికీ తెలియదని వికాసవాదులు చెప్పుచుందురు. మొదటిగ ఫ్రాంసులో ఒక గాలి గుమ్మటం(BALOON) తయారు చేయబడినదని, దానితరువాతనే గాలిలో ప్రయాణము చేయుట జరిగినదని చెప్పుచుందురు. వీరు రామాయణ కాలంనాటి పుష్పక విమానమును మరచితిరా? అది గుర్తున్నచో పూర్వకాలమునాటి విజ్ఞానము దాని సమృద్ధిని గూర్చి వారికి తెలియును.

వేదములలో విమానము యొక్క వర్ణన సామాన్యముగా పక్షి యొక్క పేరుతో వచ్చును. దీనికి 'వి' 'పతంగ' 'పతత్రి' అను పక్షి అర్థముగల శబ్దములు ప్రయోగింపబడినవి. విమానము కూడా పక్షివలె గాలిలో ఎగురును. కనుక వేదములో విమానమును పక్షి నామముతో చెప్పుట జరిగినది. దీనికి పక్షివలె రెండు రెక్కలుండి గాలిలో పైన ఎగురునపుడు పక్షి ఆకారములో కనబడుచుండును.

వేదములలో విమానము యొక్క వర్ణన అనేకస్థానములలో నున్నది.

సామాన్య విమానములే గాక 72 గం॥లలో భూమండలమునంతా చుట్టిరాగల విమానముల వర్ణన కూడా కలదు. పగలే గాక రాత్రులందుకూడా ఆకాశంలో ఎగిరే విమానముల వర్ణన కలదు.

*మం॥ తా భుజ్యం విభిరద్భ్యః సముద్రాత్తుగ్రస్య సూనుమూహథూ రజోభిః ।*
*అరేణుభి ర్యోజనేభిర్భు జన్తా పతత్రిభిరర్ణసో నిరుపస్థాత్ ॥*

*(ఋ. 6-62-6)*

ఋగ్వేదంలోని ఈ మంత్రములో 'వి', 'పతత్రి' శబ్దములు విమానమునే తెలుపుచున్నవి. కేవలము ఇదొక ఉదాహరణ మాత్రమే. వేదములలో అనేక సూక్తములలో విమానమును గూర్చి వర్ణన కలదు.

**(ఈ) అనేక రకముల విమానములు :**

వేదములో విమానమును తయారుచేయు పద్ధతిని గూర్చి చెప్పుచూ- ఆకాశములో పక్షులు ఎగురు స్థితిని గూర్చి తెలిసినవాడు, సముద్రము అనగా ఆకాశమున ఎగురు 'నౌక - విమానము' ను గూర్చి తెలుసుకొనగలడని చెప్పబడినది. సంస్కృతములో 'వి' శబ్దము పక్షిని తెలియజేయును. 'మాన' శబ్దమునకు పక్షియొక్క ఆకారము, అది ఎగిరే సిద్ధాంతముల ఆధారముగనే విమానము తయారు చేయబడినది.

పంచతంత్రంలో ఒక కథ కలదు. దానిలో ఒక ధూర్త మనుష్యుడు విష్ణువు రూపమును ధరించి గరుడాకారము గల (పక్షి) వాహనమునే తీసుకు వచ్చుచుండెను. ఇదేవిధంగా 'గయాచింతామణి' అనుగ్రంథములో కూడా నెమలి ఆకారముగల ఒక విమానము యొక్క వర్ణన గలదు.

వాల్మీకి రామాయణములో సుందరకాండలోని 9వ సర్గలో ఈ క్రింది శ్లోకము గలదు-

*శ్లో॥ బ్రహ్మణోర్థే కృతం దివ్యం దివి యద్విశ్వకర్మణా ।*
*విమానం పుష్పకం నామ సర్వరత్నవిభూషితమ్ ॥*

ఈ శ్లోకములో పుష్పక విమానమున్నట్లు స్పష్టముగా చెప్పబడినది. ఇదేవిధంగా భాగవతంలో శాల్వ రాజు యొక్క విమానమును గూర్చి వర్ణన కలదు.

శ్లో॥ *సలబ్ధ్వా కామజం యానం తమోధామ దురాసదం ।*
*యయౌ ద్వారవతీం శాల్వో వైరం వృష్ణికృతం స్మరన్।*
*క్వచిద్ భూమౌ క్వచిత్ వ్యోమ్ని గిరిశృంగే జలే క్వచిత్ ॥* (భాగవతము)

ఈ శ్లోకంలో విమానము, భూమి, జలము, ఆకాశము పర్వతములు అన్నింటిపైనుండి సులభంగా వెళ్ళుచున్నట్లు స్పష్టంగా తెలుపబడినది. భాగవతంలో కర్దమ ఋషి విమానమును గూర్చి కూడా వర్ణింపబడినది. ఆకాలంలో అది అన్నింటికంటె పెద్ద విమానముగా చెప్పబడుచుండెడిది. కొన్ని గ్రంథముల ఆధారంగా విమానములను తయారుచేయు యంత్రాగారములు బౌద్ధుల కాలమునాటి వరకు ఉన్నట్లు చెప్పుచుందురు.

విమానము నిర్మాణమునకు సంబంధించిన ఒక ప్రాచీన గ్రంథము కూడా ఉన్నది. దానిపేరు 'అంశుబోధిని'. దీనిని మహర్షి భరద్వాజుడు రచించిరి. ఈ పుస్తకంలోని అధికరణములలో విమాన అధికరణం కూడా ఒకటి. ఈ అధికరణంలో గల భరద్వాజ ఋషియొక్క సూత్రము- "శక్త్యుద్గమోద్యష్టౌ" సూత్రముపై బౌద్ధాయన ఋషి వృత్తి (వ్యాఖ్యానము) యిట్లున్నది-

శ్లో॥ **శక్త్యుద్గమో భూత వాహో ధూమయాన శిఖోద్గమః ।**
**అంశు వాహస్తారాముఖామణివాహో మరుత్సఖః ।**
**ఇత్యష్టకాధికరణ వర్గాణ్యుక్తాని శాస్త్రతః ॥**

ఈ శ్లోకములలో విమాన నిర్మాణము, అది ఆకాశములో ప్రయాణించుటకు 8 రకముల విభాగములు ఈ విధముగా నున్నవి 1) శక్త్యు ద్గమ = విద్యుత్తుతో నడచునది. 2) భూతవాహ = అగ్ని, నీరు, గాలితో నడచునది. 3) ధూమయాన = ఆవిరితో నడచునది. 4) శిఖోద్గమ = పంచశిఖి నూనెలతో నడచునది 5) అంశువాహ = సూర్యుని కాంతితో నడచునది. 6)తారాముఖ = అయస్కాంతముతో నడచునది. 7) మణివాహ = సూర్యకాంత, చంద్రకాంత మణులతో నడుచునది. 8) మరుత్సఖ = కేవలం వాయువుతోనే నడుచున్నది.

(ఋ) సముద్రపు ఓడ-నౌకలు

సముద్రములో ప్రయాణించు ఓడలు, నౌకలు మున్నగు వాని విషయంలో కూడా వికాసవాదులు భ్రమలోనున్నారు. వేదములలో సముద్రపు ఓడలు మరియు నౌకలను గూర్చి తెలుపు మంత్రములనేకములున్నవి.

మం॥ **అనారమ్భణే తద వీర యేథామనాస్థానే అగ్రభణే సముద్రే ।**
**యదశ్వినా ఊహథుర్భుజ్యుమస్తం శతారిత్రాం నావమాత**
**స్థివాంసమ్ ॥**

**(ఋ. 8-8-5)**

ఋగ్వేదములోని ఈ మంత్రంలో సముద్రముపై నడచునట్టి నౌకయొక్క వర్ణన కలదు. దీనిలో నీటిలోతు తెలుసుకొను సాధనములుండెడివి. సుడిగాలుల నుండి రక్షించుటకు, ఓడలను నిలుపుటకు వందలాది లంగర్లుండెడివి. ఇందువలన ఈ నౌక సముద్రములో నడుచు నౌకయని తెలియుచున్నది. వేదములో ఓడకు నౌక' శబ్దము వాడబడినది.

పై వేదమంత్రముల ప్రమాణము వలన వేదములలో కూడా ప్రయాణ సాధనములన్నీ వర్ణింపబడినవని స్పష్టముగా తెలియుచున్నది.

**(ౠ) 3 రోజులలో భూమి, చంద్రుని చుట్టి వచ్చు విమానము.**

వేదములో అన్ని విద్యల మూలసిద్ధాంతములున్నవి. 'అశ్వీ' అను పేరుగల వైజ్ఞానిక శక్తుల అద్భుత వర్ణన వేదములోని అనేక సూక్తములలో కలదు. ఋగ్వేదములోని 1-34-2 వ మంత్రములో అశ్వినీ శక్తులతో నడుపబడే విమానములో 3 చక్రములు 3 స్తంభములుండి 3 రోజులలో సంపూర్ణ భూగోళము యొక్క వాతావరణములో తిరిగి చంద్రలోక యాత్ర చేయునట్లు వర్ణన కలదు.

వాల్మీకి రామాయణములో వర్ణించబడిన పుష్పక విమానము సుమారు గంటకు 200మైళ్ళు ప్రయాణించుచుండెను. అందువలన కేవలం 8-10 గం॥ల లోనే అది లంక నుండి అయోధ్యకు చేరుకున్నట్లు చెప్పబడినది.

**శ్లో॥ అహ్నాత్వాం ప్రాపయిష్యామి తాం పురీం పార్థివాత్మజ ।**
**పుష్పకం నామ భద్రం తే విమానం సూర్య-సన్నిభమ్ ॥**

***(వా. రా. యుద్ధ 121-89)***

*మం॥ త్రయః పవయో మధువాహనే రథే సోమస్య*
*వేనా మను విశ్వ ఇద్విదుః।*
*త్రయః స్కమ్భాసః స్కభితాస ఆరభే త్రిర్నక్తం*
*యాథ స్త్రి ర్వశ్వినా దివా ॥*

*(ఋ. 1-34-2)*

అశ్వినా = ఓ అశ్వినీ శక్తులారా

మధువాహనే రథే = పెట్రోలు వంటి ద్రవ పదార్థముతో నడచునట్టి, తేలికైన అల్యూమినియం వంటి లోహముతో తయారైన విమానములో
త్రయః పవయః = వజ్రముతో సమానమైన కళా చక్రములు మూడుండాలి. అట్లే-
త్రయః స్కంభాసః స్కభితాసః = మూడు స్తంభాలు స్థాపించి ఉన్న విమానమును
సోమస్య వేనామ్ అను = చంద్రలోకం వైపు ప్రయాణము చేయుటకు
విశ్వే ఇత్ విదుః = అందరూ నిశ్చయముగా తెలుసుకొనవలయును.
త్రిః నక్తం ఉత్రిః దివాయాథః = (మూడు రాత్రులు - మూడు పగలు)- 3 రోజులలో నీవు తీసుకొని పోగలవు. అనగా సంపూర్ణ భూగోళమును చుట్టి రాగలవు. చంద్ర లోకము వరకు తీసుకువెళ్ళ గలవు.

ఇదొక రకమైన ఆధునిక రాకెట్టు వంటిది. దీనిలో మూడు భాగములుండును. ప్రతి భాగములో విశేషయంత్రములుండును.

**(ఎ) స్థల జల ఆకాశములలో నడుచు వాహనము**

*మం॥ వేదా యోవీనామ్ పదమంతరిక్షేణ పతతామ్,*
*వేద నావః సముద్రియః ॥*

*(ఋ. 1-25-7)*

అనగా : వరుణుడు = సేనాపతికి ఆకాశములో పోవు విమానములు వాని స్థితి, సముద్రములో నడుచు నౌకలను గూర్చి తెలియును. వానిని తన వద్ద ఉంచుకొనును.

*మం॥ దైవీం నావం స్వరిత్రా మనాగసమస్రవంతీ మారుహేమా స్వస్తయే ॥*

*(ఋ. 10-63-10)*

మేము మంచి యంత్రములతో దివ్యంగా అవిరి లేక విద్యుత్తుతో నడచునట్టి నౌకపై కూర్చుందుముగాక!

మం॥ తిస్రః క్షపస్త్రిరహాతి వ్రజద్భిర్న సత్యా భుజ్యూమూహథుః పతంగైః ।
సముద్రస్య ధన్వన్నార్ద్రస్య పారే త్రిభీ రథైః శతపద్భిః షడశ్వైః ॥
(ఋ. 1-116-4)

జ్యోతి రసముల శక్తులు, మూడు రాత్రులు మూడు పగలు అత్యంత వేగముగా ఈదునట్టి సాధనములతో, సముద్ర తీరమునుండి సముద్రము దాటి, బురదతో కూడిన నేలను దాటి, ఆకాశరూప సముద్రమును దాటుటకై వందలాది చక్రములు, యంత్రములు, స్థలజల ఆకాశములలో పయనించు రథముల (సుందర వాహనములు) తో రాజ్యమును పరిపాలించు రాజును, వ్యాపారిని సైనికులను తీసుకు వెళ్ళును.

వంద చక్రాల ఈ రథం మామూలు రథమై యుండదు. ఈ వాహనము భూమిపైన, జలముపైన, ఆకాశముపైన నడచునది. వందలాది యంత్రములు కల ఈ వాహనములో 6 రకముల వ్యాపక శక్తులుండును. అవి : 1) అగ్ని 2) నీరు 3) విద్యుత్ (బ్యాటరీలతో వెలుతురు) 4) అయస్కాంతము (దిక్సూచి మున్నగునవి) 5) ధ్వనినిచ్చునది (రేడియో మున్నగునవి) 6) గాలినిచ్చునవి (పంఖాలు, పర్దాలు మున్నగునవి)

## ప్రాచీన భారత దేశములోని యంత్రకళ

భారద్వాజముని కొన్ని వేల సం॥రం లకు పూర్వము 'యంత్రార్ణవము' అను ఒక గ్రంథమును వ్రాసిరి. దానిలో ఆయన మూడు రకముల యంత్రశక్తులను గూర్చి ప్రస్తావించెను. అవి : 1) మంత్రశక్తి 2) యంత్రశక్తి 3) తంత్రశక్తి. ఈ మూడింటి వివరణ ఈ క్రింది శ్లోకములో కలదు.

శ్లో॥ మంత్రజ్ఞా బ్రాహ్మణాః పూర్వే జల వాయ్వాది స్తంభనే ।
శక్తేరుత్పాదనం చక్రుస్తన్మంత్ర మితి గద్యతే ॥
దండై శ్చక్రైశ్చ దన్తై శ్చ సరణి భ్రమకాదిభిః ।
శక్తేస్తు వర్ధకం యత్తచ్చాలకం యంత్రముచ్యతే ॥
మానవీ పాశవీ శక్తిః కాయం తంత్రమితి స్మృతమ్ ॥ (యన్త్రార్ణవం)

జల, వాయువులను నిరోధించుట వలన పుట్టుశక్తిని 'మంత్రశక్తి' అందురు. దండము (కర్ర) చక్రములు, పళ్ళ చక్రాలనుపయోగించుట ద్వారా నడిచే శక్తిని వేగమును పెంచువానికి 'యంత్రశక్తి' అని పేరు. మనుష్యులు, పశువుల శక్తితో చేయుపనులకు 'తంత్రశక్తి' అనిపేరు.

ఈ గ్రంథములో యంత్ర మంత్ర తంత్రములను గూర్చి అనేక ప్రమాణములు కూడా కలవు. దీనిద్వారా ప్రాచీన భారత దేశములోని విజ్ఞాన విశిష్టతను తెలుసుకొనవచ్చును.

మన ప్రాచీన ఆర్యులకు వేధచక్రము, తూరీయ యంత్రము (దుర్భిణీ) అయస్కాంత సూది, థర్మా మీటరు, బెరోమీటరు మున్నగువానిని తయారుచేయుట కూడా తెలియును.

గుజరాత్‌లో అణహిలపుర జైన పుస్తకాలయములో 'శిల్ప సంహిత' యొక్క వ్రాతప్రతి ఉన్నది. దానిలో థర్మామీటరు, బెరోమీటరులు తయారుచేయు పద్ధతులు వ్రాసి యున్నవి. 'సిద్ధాంత శిరోమణి' అను గ్రంథములో 'స్వయంవహ' యంత్రమును గూర్చి వ్రాయబడినది.

**(అ) యుద్ధ యంత్రములు**

మన ప్రాచీన గ్రంథములలో యుద్ధమునకు సంబంధించిన అనేక యంత్రముల వర్ణనలు కలవు. భోజరాజు వద్ద గంటకు 11 క్రోసుల దూరం పరుగెత్తగల ఒక కర్ర గుర్రము ఉన్నట్లు 'భోజ ప్రబంధం'లో కలదు. ధమ్మ పథములోని 'వాసవదత్తా' అను గ్రంథములో కౌశంబి రాజైన ఉదయనునితో ఉజ్జయినీ రాజు చండ ప్రద్యోతనునకు విరోధముండెడిదని వ్రాసియున్నది. ప్రద్యోతనుడు ఉదయనుని బంధించుటకై ఒక ఏనుగు యంత్రమును తయారు చేయించెను. దాని ఆకారము ఒక ఏనుగు వలె ఉండి తెల్ల రంగులో ఉండెను. దానిలోపల 60 మంది కూర్చొన వచ్చునని చెప్పబడినది. ప్రద్యోతనుడు ఈ కర్ర ఏనుగును ఉదయనుని వనములో విడువగా అది అటునిటు తిరుగుచుండెను. ఈ తెల్ల ఏనుగును గూర్చి తెలిసికొని దానిని పట్టుకొనుటకు వెళ్ళిన రాజు ఉదయనుడే స్వయముగా పట్టుబడెను.

మహాభారత ఆది పర్వములో కూడా ఉదయనుని గుఱ్ఱమును గూర్చి వర్ణన కలదు. ఈ గుఱ్ఱము కూడా యంత్ర సహాయముతోనే నడుచు చుండెను. శహబాజ్ గఢీ (పెషావర్ వద్ద) లో ఒక రాతిపై రైలును గూర్చి సంకేతము కూడా లభించినది.

## వేదము - కళలు

శ్రీ శంకరాచార్యులు తన వేదాంత దర్శనభాష్యంలో 'శాస్త్ర యోనిత్వాత్' (1-1-3) అను సూత్రమునకు వ్యాఖ్యానములో యిట్లు వ్రాసిరి-

మహత ఋగ్వేదాదేః శాస్త్రస్య అనేక విద్యాస్థానోపబృంహితస్య ప్రదీపవత్స ర్వార్థావ ద్యోతినః సర్వజ్ఞ కల్పస్య యోనిః కారణ బ్రహ్మ। నహీదృశస్య శాస్త్రస్య ఋగ్వేదాది లక్షణస్య సర్వజ్ఞ గుణాన్వితస్య సర్వజ్ఞాదన్యతః సంభవోస్తి। యద్య ద్విస్తరార్థం శాస్త్రం యస్మాత్ పురుష విశేషాత్ సంభవతి స తతోప్యధికతర విజ్ఞాన ఇతి ప్రసిద్ధం లోకే కింతు వక్తవ్యమనేక శాఖా భేదభిన్నస్య దేవ తిర్యఙ్ మనుష్య వర్ణాశ్రమాది ప్రవిభాగ హేతోః ఋగ్వేదాద్యాఖ్యస్య సర్వజ్ఞానాకరస్య అప్రయత్నేనైవ లీలాన్యాయేన పురుష నిఃశ్వాసవత్ యస్మాన్మహతో భూతాద్యోనేః సంభవః తస్యమహతో భూతస్య నిరతిశయం సర్వజ్ఞత్వం సర్వశక్తిమత్త్వం చేతి ।

ఈ సందర్భంగా శ్రీ శంకరాచార్యులు వేదములను సర్వజ్ఞానాకరములు అనగా జ్ఞానములన్నింటికి నిధిగా చెప్పిరి. స్వామీ దయానందులైతే తన ఋగ్వేదాది భాష్య భూమిక మరియు యితర గ్రంథాలలో ఎన్నో చోట్ల వేదములు సమస్త విద్యల పుస్తకమని జ్ఞానములన్నింటికి భండారముగ ప్రతిపాదించిరి.

వేదములను తమ ధర్మగ్రంథముగ అంగీకరించు వారే గాక ఇతర విద్వాంసులు కూడా ఏకస్వరముతో వేదములలో జ్ఞానములన్నీ కలవని చెప్పిరి. ఆంగ్లేయ విద్వాంసులు కూడా దీనిని అంగీకరింతురు.

ఇది పరిణామ వాద యుగము. ఇంతకు పూర్వముకంటె యిప్పుడు ప్రతి దినము ప్రపంచము ఉన్నతి చెందుచున్నదని వికాస (పరిణామ) వాదుల సిద్ధాంతము. ప్రాచీన కాలమునాటి ఆర్యులు సభ్యత తెలియని ఆటవికులని, కట్టుకొనుటకు వస్త్రములను తయారుచేసుకొనుట కూడా వారికి తెలియక

దిగంబరులుగ నుండెడివారని, ఇళ్ళు కట్టుకొనుటరాక చెట్ల క్రిందనే రాత్రింబవళ్ళు చలిలో వర్షంలో ఎండలో గడుపుచుండెడివారని చెప్పే-వీరిమాటలు నిరాధారమైనవని వేదమంత్రముల ద్వారా తెలియజేయుదుము. ఈ కళలు సాధారణమైనవిగాక అత్యంత ఉత్కృష్టమైనవి. ఈ వర్ణనలు చూచిన తరువాత నేటియుగము ఉన్నతినొందునది గాక అవనతి నొందునదిగ చెప్పవలసి వచ్చును. నేడు ప్రపంచమంతటా అభివృద్ధి చెందిన కళలన్నింటినీ చూచినా కూడా వేదములలో వర్ణింపబడిన వానికంటె తక్కువే అని చెప్ప వచ్చును.

**(అ) గృహనిర్మాణము శిల్పకళలు**

ప్రాచీన ఆర్యులు గృహములను సుందరముగ, మన్నికగలవిగ, అందరినీ ముగ్ధులను చేయునట్లు నిర్మించుచుండిరి. ప్రాచీన గృహనిర్మాణములను చూచి ఎంతో నైపుణ్యముగల నేటి విశ్వకర్మలు కూడా ఆశ్చర్య చకితులగుచుందురు. మహాభారత కాలమునాటి విశ్వకర్మ - మయుడు నిర్మించిన భవనము మయసభలో అపరిచితులకు నీరు - నేలల భేదము తెలియనంతగ, ఎక్కడ ద్వారములున్నవో తెలియనంత నైపుణ్యంతో నిర్మింపబడినది. దుర్యోధనాదులు ఈ భవనములోనికి వెళ్ళి నేలను చూచి నీరనుకొని వస్త్రములను పైకి మలచుకొని పోవుట, జలమును చూచి నేలగా భ్రమించి వస్త్రాలను పైకి మలచకుండా పోవుటవలన వస్త్రములు తడచి నవ్వుల పాలైరి. నేడు అటువంటి ఆశ్చర్యకరమైన భవనము ఏ నాగరికత గలిగిన దేశములో నున్నదో వికాసవాదులకే తెలియాలి.

ఇళ్ళపై చిత్రకళలను చెక్కుటలో కూడా ప్రాచీన ఆర్యులు గొప్ప నిపుణులు. నేటికిని మిగిలియున్న వారి చిత్రకళను చూచి దేశంలోని వారేగాక యితర దేశీయులు కూడా ఆశ్చర్యమును చెందుచుందురు. దక్షిణ భారతములో బౌద్ధుల కాలపు నాటి అజంతా గుహలు శిల్పకళలలో శిల్పముల రంగులు నేటికి కూడా యిప్పుడే చిత్రించినట్లున్నవి. దీనితో ప్రాచీన ఆర్యులు గృహ నిర్మాణము, చిత్రకళలను గూర్చి తెలియనివారు కారని, పైగా వారి విద్యలో గురువులని తెలియును.

అజంతా గుహలకంటె పురాతనమైన గుహలలోని శిల్పములను నేడు

కనుగొని ఆశ్చర్యపోవుచున్నారు. మధ్య భారత దేశములోని సరగూజా సంస్థానములోని 'రామగఢ్' అను ప్రదేశములో అజంతా గుహలకంటె వంద సం॥ రం లు పురాతనమైన గుహలను కనుగొనిరి. వానిలో చెక్కిన చిత్రములు భారతదేశ ప్రాచీన చిత్రకళాకౌశలమును చాటుచున్నవి. శిలలను, కొండలను చెక్కి తయారుచేసిన ఈ గుహలలోని చిత్రములు నేటికిని సురక్షితంగా నున్నవి. ఇందుకు కారణం తెలిసినదే (ఆనాటి శిల్పుల కళానైపుణ్యము)

అథర్వ వేదములోని 9వ కాండం - 3వ సూక్తంలో మహాభవనముల నిర్మాణమును గూర్చి వర్ణన కలదు. ఈ సూక్తమును చదివినచో ప్రాచీన కాలంలో కూడా గృహనిర్మాణంలో నేడు జరుగుచున్న పనులన్నీ జరుగుచుండెడివని తెలియును. ఇళ్ళను నిర్మించుటకు ముందు ముగ్గు వేయుట, కొలతలు తీసి కొయ్యలు పాతుట, ఇళ్ళు కట్టుటకు కర్ర దూలములను తయారు చేయుట, ఒక పెద్దగదికి చుట్టూ నలువైపులా చిన్న చిన్నగదులు నిర్మించుట, పెద్ద భవనములలోపల చిన్న చిన్న వసతి గృహాలను నిర్మించుట మున్నగు విషయాలు ఈ సూక్తములో వర్ణించబడినవి.

**(ఆ) రాతి నగరము**

వేదములలో రాతితో నిర్మించిన నగరముల వర్ణన చూచినచో ఆశ్చర్యము చెందుదుము. ఉదాహరణకు ఈ ఋగ్వేద మంత్రమును చూడుడు-

మం॥ ***శతమశ్మన్మ యీనాం పురామింద్రో వ్యాస్యత్ ।***
***దివో దాసాయ దాశుషే ॥***

***(ఋ. 4-30-20)***

ఇంద్రః = సూర్యునితో సమానమైన తేజస్సుగల
దివోదాసాయ= ప్రకాశమును సేవించువారు మరియు
దాశుషే = ఇచ్చువారి కొరకు
అశ్మన్మయీనాం పురాం శతమ్= రాతితో నిర్మించిన వందలాది నగరాలను
వ్యాస్యత్= ధ్వంసము చేయు రాజే విజయము నొందుటకు యోగ్యుడు.

ఈ మంత్రములో రాతితో నిర్మించిన వందలాది నగరముల వర్ణన కలదు. ఢిల్లీలో ఎర్ర రాతితో నిర్మించిన ఎర్రకోట వేదములో వర్ణించిన ఈ

నగరములతో పోటీపడలేదు.

**(ఇ) లోహనగరము**

ప్రాచీన ఆర్యులు లోహనగరాలను నిర్మించుచుండెడివారు. దానికి సంబంధించి ఋగ్వేదంలోని ఈ మంత్రమును చూడుడు.

*మం॥ యథావః స్వాహాZ గ్నయే దాశేమ పరీడాభిర్*
*ఘృతవద్భిశ్చ హవ్యైః । తేభిర్నో అగ్నే అమితై*
*ర్మహోభిః శతం పూర్భిరాయసీభిర్నిపాహి ॥*

*(ఋ. 7-3-7)*

ఓ విద్వాంసులారా! యథా = మనము ఏవిధంగానైతే, వః = మీ కొరకు, స్వాహా = సత్యకర్మతో, ఘృతవద్భిః= ఘతాదులతో కూడిన, హవ్యైః = హోమము చేయుటకు తగిన పదార్థములు, చ = మరియు, ఇడాభిః = అన్నములతో, అగ్నయే = అగ్నికొరకు, శతమ్ = వందలాది హవిస్సులను, పరిదాశేమ = అన్ని వైపులనుండి యిత్తుమో అట్లే, అమితైః = అసంఖ్యాక, మహోభిః = గొప్ప గొప్ప కర్మలు లేక పురుషులు మరియు, తేభిః = వారియొక్క, ఆయసీభిః = లోహముతో తయారైన, పూర్భిః = నగరములతో కూడియున్న, నః = మాకు, అగ్నే = అగ్నితో సమానమైన ప్రకాశముతో ప్రకాశించు ఓ రాజా!, నిపాహి = నిరంతరము రక్షించుము.

ఈ వేదమంత్రములో లోహముతో తయారైన నగరాల వర్ణన కలదు. ఈ విధంగా ఎన్నో వేదమంత్రాలలో లోహాలతో తయారైన నగరాల వర్ణన స్పష్టంగా సుందరంగా వర్ణింపబడియున్నది.

ప్రాచీన ఆర్యులు అడవులలో నివసించే వారనుట అసత్యము. వారు పెద్ద పెద్ద సుందరమైన మన్నికతో కూడినగృహములను నిర్మించుచుండెడివారు. రాళ్ళు లోహముతో కూడిన నగరములను నిర్మించు చుండిరి.

**(ఇ) వస్త్రముల నిర్మాణము**

వస్త్రములను తయారుచేయుటలో కూడా ప్రాచీన ఆర్యులు ఎంతో నిపుణులు. ఢాకా మల్ మల్ చాలా ప్రసిద్ధి చెందినది. వేద కాలంలో పురుషునితో పాటు ప్రతిస్త్రీ వస్త్రములను తయారుచేయుచుండెడిదని ఈ

క్రింది వేదమంత్రము ద్వారా తెలియుచున్నది.

మం॥ **యే అన్తాః యావతీ సిచోన ఓతవో యే చ తన్తవః ।**
**వాసో యత్ పత్నీభిరుతం తన్నః స్యోనముపస్పృశాత్ ॥**

**(అథర్వ 14-2-51)**

ఈ వేదమంత్రములో పత్నులు నేసిన వస్త్రముల వర్ణన కలదు. అంచులు, ఎంబ్రాయిడరీలతో వస్త్రాలను నేయు వర్ణనలు కూడా వేదమంత్రములలో కలవు. వేదకాలములో ప్రతి ఒక్క ఇంటిలో స్త్రీలు వస్త్రాలను నేయుచుండినట్లు తెలియుచున్నది. వేదమంత్రములోని 'స్యోనమ్' పదము -ప్రాచీన ఆర్యులు- గృహదేవతలు(స్త్రీలు) స్వయంగా గృహములలో నేసి తయారు చేసిన వస్త్రాలను ధరించుటలోనే సుఖమును అనుభవించుచుండిరని తెలియుచున్నది. వేదములలోని అనేక మంత్రములలో గల వస్త్ర నిర్మాణ కళలలో కూడా అత్యంత నిపుణులని సిద్ధించుచున్నది.

**గొప్ప ఆశ్చర్యము**

మహదాశ్చర్యకరమైన విషయమేమంటే బ్రహ్మ దేశము (బర్మా)లోని ఐరావతీ నదిలో ఈ మధ్యనే ఒక వస్తువు దొరికినది. దాని ఆకారము ఆంగ్లేయుల టోపీ (HAT)వలె ఉన్నది. పురాతత్వ పరిశోధకులు దాని ఆయువు 6 కోట్ల సం॥రాలుగా నిర్ణయించిరి. పాశ్చాత్య విద్వాంసులైతే సృష్టిని కూడా ఇంత ప్రాచీనమైనదని అంగీకరించరు. కాని ఈవస్తువు ద్వారా వైదిక కాలమునాటి శాస్త్రకారులు ఆధునిక పరిశోధకులను ఓడించి, వేదములో చెప్పినట్లుగ ఈ సృష్టి అతి ప్రాచీనమైనదని నిరూపించిరి. దీనితో పాటు భారత దేశపు ఆదిమవాసులు కూడా గొప్ప వైజ్ఞానికులని నిరూపించిరి. ఈ విధంగా ప్రాచీన ఆర్యులు నివసించిన కాలము ప్రగతితో కూడినదని ప్రస్తుతకాలము తిరోగమనము చెందుచున్నదని మనకు తెలియుచున్నది.

## వృక్షములలో జీవుడు

వేదాది శాస్త్రముల మరియు ఋషి ప్రణీత గ్రంథముల స్వాధ్యాయము నేడు లేని కారణంగా ఈశ్వరుడు సాకారుడా ? నిరాకారుడా? శ్రాద్ధతర్పణములు

జీవించియున్న పితరులకా? మరణించిన పితరులకా? ద్వైత్వమా? త్రైతమా? ఏది వైదికము. భూత ప్రేత పిశాచాదులను నమ్మవలయునా? వలదా? మున్నగు విషయాలపై ఆలోచనాపరులైన విద్వాంసుల మధ్య సంఘర్షణ జరుగుచున్నది. ఇదే విధంగా "వృక్షములలో జీవమున్నదా? లేదా? అను విషయముపైన కూడా సంఘర్షణ జరుగుచున్నది. చాలా మంది ఈ విషయమును గూర్చి ప్రామాణిక గ్రంథాలలో రెండురకములకు సంబంధించిన (వృక్షములలో జీవమున్నదని-లేదని) ప్రమాణములు లభించునని చెప్పుచుందురు. ఇదెట్లు సాధ్యము? ప్రామాణిక గ్రంథాలు ఒకే విషయముపై రెండు విరుద్ధ ప్రమాణములనిచ్చి భ్రమ ఎందుకు కల్పించును? శాస్త్రములన్నీ ఉచ్చస్వరముతో-వృక్షములలో జీవుడున్నట్లు చెప్పుచున్నవి. వృక్షములలో జీవుడు లేడనువారంతాతమవాదమును సమర్థించుకొనుటకు ఇట్లు చెప్పుచుందురు". వైదిక గ్రంథములలో అంతటా 'జగత్' మరియు 'తస్థుష' అను శబ్దములున్నవి. వాని అర్థము 'జడము-చేతనము'. సృష్టి లోని పదార్థములన్నీ జడము-చేతనము లని రెండు రకములు. వానిలో వృక్షములు జడము వృక్షములలో చేతనము లేదు. కావున జీవుడు లేడని వీరు చెప్పుచుందురు. కానీ ఈ ప్రమాణమును ఏవిషయంలో చెప్పుచున్నామనునది వారాలోచించరు. వృక్షములలో జీవుడున్నాడను విషయంలోనా? లేక సృష్టి రెండు రకములుగ నుండునను విషయం లోనా? సృష్టి జడము-చేతనము అని రెండు రకములని అంతా అంగీకరించెదరు. ఋషి దయానందుడు సత్యార్థ ప్రకాశములోని నవమసముల్లాసంలో వృక్షములు జడములని వ్రాసిరి. కనుక వానిలో జీవుడు ఉండుటకు వీలులేదని మరొక ప్రమాణమును కూడా-వృక్షములలో జీవుడు లేడను వారు చెప్పెదురు. కాని జడమనగా 'నిర్బుద్ధి' అని అర్థము. అనగా బుద్ధి లేకుండుట. ఈ బాలుడు జడుడు. వానికేది అర్థము కాదు అనుచుందుము. ఇక్కడ కూడా జడమంటే బుద్ధి లేనివాడని(నిర్బుద్ధి)అర్థము. 'స్థాణురయం భారహారః' అను నిరుక్త వచనం కూడా బుద్ధి లేని భారవాహకుని "చెట్టు మొదలు" అని చెప్పును. ఆ భారవాహకుడైన మనుష్యునిలో కూడ జీవుడు లేడా?

వారు చెప్పు మూడవ ప్రమాణము-'ద్వాసుపర్ణాసయుజాసఖాయాస మానం వృక్షం పరిషస్వజాతే అను ఋఙ్మంత్రములో ప్రకృతికి ఉపమానముగా వృక్షమును చెప్పెను. ప్రకృతిజడము. కనుక వృక్షముకూడా జడము. అందువలన వృక్షములలో జీవములేదని చెప్పుచుందురు. ఈ మంత్రములో ఉపమా లేదు. ఇచ్చట రూపకాలంకారమున్నది. కనుక ప్రకృతిలో జీవములేనందున వృక్షములలో కూడా జీవములేదనుమాట సరికాదు. 'చరణకమల' మనునది రూపకాలంకారమునకు ఒక ఉదాహరణ. కమలములో జీవము లేనందున మన చరణములలో కూడా జీవముండదా? మరొక ఉదాహరణ - చంద్రానన (చంద్రుని వంటి ముఖము). ముఖము(నోరు)తినును. కాని చంద్రుడు కూడా తినునా? చంద్రుడు నిర్జీవము. కనుక నోరు కూడా నిర్జీవమా? ఇదేవిధంగా 'బింబోష్ఠి (బింబము వంటి పెదవులు)' అను శబ్దమును తీసుకున్నచో బింబములో జీవము లేనిచో పెదవులలో కూడా జీవముండదా? ఈ విధంగా చూస్తే వృక్షములలో జీవము లేదను వారి పక్షము సర్వదా బలము లేనిదై వారి మాట సిద్ధింపదు. సృష్టి స్థావరము, జంగమము అనగా జడము, చేతనమని రెండు విధములు. చేతనసృష్టి జీవులు చేయు కర్మలకు తగిన విధంగా జరుగును. కర్మలు 1. సాత్త్వికము 2.రాజసము 3. తామసికములని మూడు రకములు.ఈ మూడు రకముల కర్మలు బుద్ధి సహాయంతోను, బుద్ధి సహాయం లేకుండాను(ప్రమాదము) సోమరితనముతోను చేయబడుచుండును. బుద్ధితో ఆలోచించి సాత్త్విక కర్మలు చేసినచో జ్ఞానముగల 'మనుష్య' శరీరము లభించును. బుద్ధితో ఆలోచించకుండా ఏదో ఒకటి తప్పు-ఒప్పులతో పనులు చేసినచో జ్ఞానము లేని 'పశు' శరీరము లభించును. సోమరితనము(ప్రమాదము) అహంకారములతో దుష్కర్మలు చేసినచో కర్మలు లేని అంధకారముతో కూడిన 'వృక్ష' శరీరము లభించును. జ్ఞానంతో ఇంద్రియాలను ఉపయోగించు కున్నందున మానవులకు జ్ఞాన-కర్మలను ధరించునట్టి పరిపూర్ణ అంగములు యివ్వబడినవి. అజ్ఞానంతో ఏదో ఒకటి చేసినందున పశువులకు జ్ఞానంలేకుండా ఏదో విధంగా పని చేసే పూర్ణత్వము

లేని అంగములు యివ్వబడినవి. జ్ఞానకర్మలను రెండింటిని తెలిసి కూడా దురుపయోగము చేయుటవలన వృక్షములకు జ్ఞాన కర్మలను రెండింటినీ లేకుండా చేసెను. ఈ విధంగా మూడు విధములైన కర్మలను చేసిన కారణముగా మానవులు, పశువులు, వృక్షములను మూడు రకముల ప్రాణులు ఉత్పన్నమైనవి.

మొదట భోగ్య పదార్థము ఉత్పన్నమైన తరువాత భోక్త-అనుభవించు వాడు ఉత్పన్నమగునను నది సృష్టి నియమము. ముందుగా పాలు పుట్టిన తరువాత శిశువు జన్మించును. అదేవిధముగా పశువులకు భోగ్య పదార్థమైన వృక్షములు ఉత్పన్నమైన తరువాత పశువులు ఉత్పన్నమగును. అట్లే మనుష్యులకు ఉపయోగపడే వృక్షములు, పశువులు పుట్టిన తరువాత మానవుడు పుట్టును. వేదములో కూడా చేతన సృష్టిని గూర్చి ఈ క్రమమునే చెప్పెను. యజుర్వేదంలోని 31వ అధ్యాయం 6వ మంత్రంలో

*మం॥ ఓమ్ తస్మాద్ యజ్ఞాత్ సర్వహుతః సంభృతం పృషదాజ్యం।*
*పశూంస్తాంశ్చక్రే వాయవ్యానారణ్యా గ్రామ్యాశ్చయే॥*

చేతన సృష్టిలో ముందుగా భక్ష్యాన్నములు ఉత్పన్నమైనవి. తరువాత పశువులు తరువాత మనుష్యులు పుట్టిరి. స్వామీ దయానంద సరస్వతి ఋగ్వేదాది భాష్య భూమికలో సృష్టి విద్యా ప్రకరణములోగల పై మంత్రము లోని 'పృషద్' శబ్దమునకు 'భక్ష్యాన్నమని' యే వ్రాసిరి.బుద్ధి పూర్వకముగా సాత్త్విక కర్మలు చేసి నందుననే మానవులకు ఈశరీరములు లభించుచున్నవి. అందువలననే మానవుల శిరస్సు(తల)ద్యులోకము వైపు నక్షత్ర మండలము వైపున కుండును. కాని తమ బుద్ధిని సముచితముగా ఉపయోగించుకోని వారి బుద్ధి యొక్క కేంద్ర స్థానమైన శిరస్సు ద్యులోకము వైపు నుండి క్షితిజము-భూమి ఆకాశములు కలిసినట్లు ఉండే స్థానమువైపుకు మార్చబడినది. ఇందు వలననే పశుపక్ష్యాదుల శిరస్సులు ద్యులోకము వైపు ఉండవు. ఐనా ఈ జంతువులన్నీ నడువగలవు. అందువలన వీని యొక్క కర్మేంద్రియములు నశింపలేదు. సోమరితనము అభిమానములతో తెలిసి కూడా పాప కర్మలను

చేసిన మనుష్యుల కర్మేంద్రియాలను కూడా తీసి వేసి వారి బుద్ధికి కేంద్ర స్థానమైన శిరస్సు నేలలో పాతిపెట్ట బడినది. ఆ జీవులన్నీ వృక్షములుగ పుట్టించబడినవి. అవి నడువలేవు. వానిలో జ్ఞానము కూడా ఉండదు. పశువులు, వృక్షములు వాని పూర్వ జన్మలలో మనుష్య శరీరంతో నున్నపుడు తోటి మానవులకు కష్టములు కలిగించెను. అందువలననే వారు మానవుల వలె గాక ఇంద్రియాదులు లేకుండా మానవుల ఆధీనములో జీవించుచు వారి ఋణమును తీర్చుచున్నారు. వృక్షములు తమ పూర్వ శరీరములతో మనుష్యులకు పశువులకు యిరువురకు కష్టమును కలిగించెను. అందువలన అవి మానవులు, పశువులు ఈ యిరువురి అధీనములో నుండి యిరువురకు ఉపయోగపడుచున్నవి.

మహర్షి దయానంద సరస్వతి కూడా సత్యార్థ ప్రకాశంలోని నవమసముల్లాసములో పైన చెప్పిన విషయమునే వ్రాసిరి. అందులో సందేహమేమీ లేదు. ఆయన మనుస్మృతిలోని 12వ అధ్యాయములోని ఈ శ్లోకమును వ్రాసిరి.

శ్లోక॥ ***స్థావరాః క్రిమికీటకాశ్చ మత్స్యాః సర్పాశ్చ కచ్ఛపాః।***
***పశవశ్చ మృగాశ్చైవ జఘన్యా తామసీ గతిః॥***

ఈ శ్లోకార్థములో అత్యంత తమోగుణము కల వారు స్థావర వృక్షాది, క్రిమి కీటకములు, మత్స్య(చేప)సర్ప, కచ్ఛప(తాబేలు)పశువులు, మృగాలుగ జన్మించెదరు. 'శరీర జైః కర్మ దోషైః యాతి స్తావరతాం నరః! అని మను మహారాజు ఢంకా మ్రోగించి చెప్పిరి. స్వామీజీ దీనికి అర్థమును వ్రాయుచు శరీరముతో దొంగతనముచేయుట, వ్యభిచారము, మంచి వారిని కొట్టుట మున్నగు పాపపు పనులు చేయు మానవులకువృక్షాది స్థావర జన్మ లభించును. అని ఇంత స్పష్టముగా స్వామీజీ వ్రాయగా వృక్షములలో జీవుడున్నాడా? అను విషయమును గూర్చి స్వామీజీ స్పష్టంగా ఏదీ వ్రాయలేదని ఎవరైనా ఆయనపై దోషారోపణ చేయగలరా?సత్యార్థప్రకాశం అష్టమ సముల్లాసంలో ప్రశ్న: ఈశ్వరుడు కొన్ని జీవులకు మనుష్య జన్మను, కొన్ని జీవులకు సింహాది క్రూర జన్మ, కొన్ని జీవులకు లేడి, గోవు మున్నగు పశు జన్మ, కొన్ని జీవులకు వృక్షాది

క్రిమి, కీటక పక్షుల జన్మలనిచ్చెను. ఇందువలన పరమేశ్వరుడు పక్షపాతి యగును కదా? ఉత్తరము: "ఆయా జీవులు తమతమ పూర్వ జన్మలలో చేసిన కర్మలకు తగినట్లుగా(ఫలము)జన్మల నిచ్చుట వలన ఈశ్వరుడు పక్షపాతి కాదు. జీవులు కర్మలు చేయకుండా జన్మలిచ్చినచో ఈశ్వరునకు పక్షపాత దోషము వచ్చును" అను ఈ ప్రశ్నోత్తరములతో కూడా పరమాత్ముడు జీవులకు కర్మాను సారముగనే వృక్షాది జన్మల నిచ్చుచుండునని స్పష్టమగుచున్నది. జీవములేని పదార్థమేదైనా పెరుగుతుందా? చెప్పండి. నదిలో నున్న రాయి పెరుగునని మీరనవచ్చును. కాని అది బెల్లమునకు బెల్లము కలిపినా, మట్టి ముద్దకు ఇంకా కొంత మట్టి అంటించినా అవి పెద్దవైనట్లే నీటిలోని రాయి కూడా నది లోని ఇసుక నీరు కలిసి రాయి పెద్దది కావచ్చును. లేదా వాటి రాపిడి, లేక యితర రాళ్ళ రాపిడి వలన గాని ఆరాయి చిన్నది కావచ్చును. జీవములేని పదార్థ మేదైనా పుడుతుందా? జీవము లేని పదార్థము మగ - ఆడల సంయోగముతో పుడుతుందా? కేవలం మగ లేక ఆడ బొప్పాయి మొక్కను నాటిచూడండి. దానికి పండ్లు రావు. వృక్షములలో జీవుడున్నట్లయితే సజీవముతో నున్న పదార్థమును ఎట్లు తినగలము.? మాంస భక్షణములో కలుగు దోషమే శాఖాహారములో ఫలాదులను తినుటలో కూడా కలుగునను సందేహము మీ మనస్సులో కలుగ వచ్చును. మాంసమును తినుటవలన కలిగే దోషమేమిటో ముందుగ ఆలోచించాలి. మాంసమును తినుట వలన కలిగే దోషము కంటే ప్రపంచమునకు ఉపకారము చేయు పశువులను చంపుట వలన ఎక్కువ దోషము కలుగును. మాంసాహారమునకు అలవాటు పడినవారు చనిపోయిన పశువుల మాంసము దొరకనపుడు మాంసమును తినవలెనను కోరికతో బ్రతికివున్న పశువులను కూడా చంపుదురు. పశువులను చంపుట పాపము. కనుక మాంస భక్షణ కూడా పాపముగా చెప్పబడినది. మాంసము తినక పోయినచో పశువులను చంపవలసిన అవసరముండదు. మానవునకు ఎంత ఎక్కువగ ఉపయోగపడు జంతువును చంపిన అంత ఎక్కువ పాపము చంపిన వారికి కలుగును. అందరికంటే తల్లి-దండ్రులు, అన్నదమ్ములు, అక్క చెల్లెళ్ళు, బంధువులు ఎక్కువ ఉపకారము చేయుదురు.

కనుక వారిని చంపుట వలన ఎక్కువ పాపము కలుగును. తరువాత దున్నలు వాని కంటె తక్కువ ఉపకారము మేకలు మున్నగు వాని వలన కలుగును. వీనిని 5చంపినచో అదే క్రమములో పాపము కలుగును. అడవి పంది, పులి మున్నగునవి మానవులకు ఏమీ ఉపకారము చేయు జంతువులు కావు. కనుక వానిని చంపినచో పాపముగ తలంచక పైగా వీరత్వముగా భావించెదరు. ఈ విధంగా వేని ద్వారా మానవులకు ఎక్కువ ఉపకారము జరుగునో వానిని నష్టము చేయుట వలన అంతే పాపము వారికి కలుగునని తలంచబడుచున్నది. మానవులకు ఎక్కువగా ఉపయోగపడు వృక్షములను చంపుట కూడా ఎక్కువ చెడుపే. రావిచెట్టును ఎవరైనా కొట్టినచో ఆ కొట్టిన వ్యక్తిని చంపుటకు కూడా కొందరు సిద్ధపడుదురు కానీ అముదము చెట్టును కొట్టినచో ఎవరూ పట్టించుకోరు. పిచ్చిగా చెట్లు మొలచిన చోట వానిని నరికి వేయుటే మంచిదిగా భావించెదరు. ఇదేవిధంగా కూరలు పొలాలలో ఉంటే మానవుల కేమీ ఉపయోగపడవు. పైగా అవి కుళ్ళి దుర్వాసనతో రోగములు పెంపొంది అపకారము చేయును. కూరగాయలను ఆహారంగా వాడుకున్నచో ఆరోగ్యము, బలము చేకూరును. అంతటికీ పరోపకారము ముఖ్యము ఉపయోగపడే దానిని నష్టము చేయుటవలన పాపము తగులును. ఉపకారము లేని దానిని నష్టము చేసినా పాపము తగులదు. కనుక ఫలాదులను తినుట పాపమను సందేహముండరాదు. వృక్షములలో జీవుడు ఉండును. ఇది నిర్భ్రాంత సత్య సిద్ధాంతము, శాస్త్రసమ్మతము, తర్కసంగతము.

## వేదములలో అలంకారములు

నేటి సంస్కృత సాహిత్యములో అనేక కవులు రచించిన గ్రంథములు ఏదో ఒక విశేషతను కలిగి యున్న కారణంగా ప్రసిద్ధి గాంచినవి. అవి హృదయమునకు హత్తుకొనును. బహుశాఅలంకారముల వలననే ఈ విశేషత వానికున్నది. కవికుల శిరోమణి మహా కవి కాళిదాసు రచించిన రఘు వంశకావ్యము ఉపమాలంకారములకు, త్రివిక్రమ భట్టు రచించిన నలచంపూ, సుబంధు రచించిన వాసవదత్త సుందరమైన శ్లేషాలంకారము లకు అనుపమమైనవి. బాణ భట్టుడు రచించిన కాదంబరి కావ్యము శ్లేషాలంకారము

లతో నిండి సరసభాషకు ఏమాత్రం లోపం లేకుండా యున్నది. పురాణాలల్లో కూడా ఇష్ట దేవతల పేర్లు శిష్ట భాషలోనే వర్ణింపబడినవి. వీనిలోగల ఈ విశేష గుణ కారణంగానే అవి అంత సుందరంగాను, మనోహరముగాను ఉన్నవి. ఈ ఉత్కృష్ట విద్వాంసులైన కవుల రచనలు యిప్పటికీ విద్వాంసులను ముగ్ధులను చేయుచున్నవి. విద్వాంసులు ఈరచనలను మాటిమాటికి చదివి వానిననుసరిం చుచున్నారు. దీనికంతకూ కారణం ఈ రచనలలో గల అలంకారముల మూలంగా వానిలో కలిగిన విచిత్రమైన, సుందర గుణాలు, అవి వానిని సరస మొనర్చినవి.

భాషలో సరస, సజీవ గుణాలనుత్పన్న మొనర్చి చదువువారి మనస్సునకు ఆహ్లాదమును కలిగించునట్టి ఈ అలంకారములు ఎక్కడి నుండి వచ్చినవి? ఈ అలంకార గ్రంథాలను రచించిన కవులు ప్రాచీన కావ్యాలను చూచి నేర్చుకున్నారా? కాదు. ఈ అలంకారములు ప్రాచీన కావ్యముల కంటె ముందు కూడా ఉన్నవి. లోతుగా పరిశీలిస్తే తెలిసే. విషయమేమంటే అన్నిటికంటే ప్రాచీన సాహిత్యమైన వేదాలలో ఈ అలంకారాలు ఆధునిక సంస్కృతి సాహిత్యలోకంటే ఎన్నోరెట్లు ఎక్కువగా నున్నవి. లౌకిక సంస్కృత సాహిత్య రచనలలోనైతే కవులు కోషములలో గల నానార్థములపైనే ఆధారపడి రచనలు చేసెడివారు. ఇప్పుడు కూడా అంతే. కాని వైదిక భాషలోని ప్రతి ఒక్క శబ్దము యౌగికమగుట వలన ఏ కోషము యొక్క సహాయము లేకుండానే నానార్థములను అవి చెప్పును. కనుక వేదభాష చాలా అద్భుతము-రసమయమైనది. కోషములో గల నానార్థములకే పరిమితమై రచనలు చేయుట వలన స్వతంత్రతలేక బాధకు గురియైన ఉత్తమ కవులు కోషములోని నానార్థములను స్పష్టముగా తిరస్కరించిరి. వారు స్వతంత్రతతో కూడిన శబ్దముల యౌగిక రచనల ఆధారంగానే అద్భుతమైన వ్యంగ్యముతో కూడిన రచనలు చేయుటలో సమర్థులైరి. ఏలయనగా: ఆధునిక రచనలన్నీ కోషములలో గల నానార్థముల ఆధారముగానే చేయబడినవి. వైదిక రచనలు యౌగిక శబ్దముల ఆధారంగా చేయబడుట వలన అత్యుత్తమమైనవి. కావున ఉత్తమ కోవకు చెందిన కవుల రచనలలోని దృష్టాంతములలో అచ్చటచ్చట వేదవాణి

లోని అలంకారములు కనబడుచుండును. వేదము కూడా పరమాత్మని సుందర కావ్యము. దీనిలో కూడా మంత్రములు, ఉపమ, శ్లేష, రూపక, పునరుక్తవదాభాస మున్నగు అలంకారములు కలవు. శ్రీ మమ్మటాచార్యవాగ్భట విశ్వనాథ మరియు దణ్డీ మున్నగు అలంకార శాస్త్రులు ఈ అలంకారములన్నింటిని క్రమబద్ధము చేసి చక్కటి వ్యవస్థనొనరించిరి. ఒక్కొక్క అలంకారమునకు అనేక భేదోప భేదములను తెలిపి విస్తారముగా వర్ణించిరి. కాని ఈ ప్రకరణములో సంక్షేపముగానే వేదమంత్రములలోని అలంకారములను గూర్చి తెలుపబడును. వేద మంత్రము లు వివిధ అలంకారములతో ఎంత సుందరముగా అలంకరింపబడి యున్నవో వేదమంత్రముల భావమును అలంకారముల భావములను వాటి సంబంధమును చూచినచో తెలియును.

(అ) ఉపమా, పునరుక్తవదాభాసములు

*యత్ర బాణాః సంపతంతి కుమారా విశిఖా ఇవ*

**(యజు 17-48)**

అనగా: శిఖలేనట్టి కుమారుడు(యువకుడు)పరుగెత్తుచూ నలువైపులా తిరుగుచున్నట్లుగ 'ఏయుద్ధములోనైతే బాణములు నలువైపులనుండి' పడుచున్నవో అని. ఈ వేద మంత్రములో రెండు అలంకారములున్నవి. అవి 1. ఉపమాలంకారము 2. పునరుక్తవదాభాసాలంకారము. విశిఖా అనగా శిఖ లేనట్టి-కేవల ముండనముతో నున్న చాలా మంది బాలురు ఒక చోట చేరి ఇటునటు గంతులు వేయుచు తిరుగుచు పరుగెత్తు చున్నట్లుగ యుద్ధములో బాణములు నలువైపుల నుండి వచ్చి పడుచున్నవి అని దీని భావము. ఎంత సుందరమైన ఉపమానము(పోలిక)! ఇది పూర్ణోపమాలంకారము. సంస్కృత సాహిత్యంలో 'విశిఖ' శబ్దమునకు రెండర్థములున్నవి. 1. విశిఖ(వి+శిఖ)అనగా శిఖలేకుండా అని ఒక అర్థము,విశిఖ అనగా 'బాణమని' కూడా అర్థము. ఈవేదమంత్రములో ఆపాతతః = అన్ని వైపులనుండి పడుచున్న విశిఖ' అనగా 'బాణమని' అర్థమగుచున్నది. ఈ విధంగా అర్థము చెప్పినచో పునరుక్తి దోషము

వచ్చును. ఎట్లన : పై మంత్రములో 'బాణ' శబ్దము కూడా ఉన్నది. మరల బాణ శబ్దమునకు పర్యాయ వాచకమైనే విశిఖ' శబ్దమును ఉపయోగించుటవలన పునరుక్తియే యగును. కానీ విశిఖ' శబ్దము నకు(వి+శిఖ) శిఖ లేని' అని అర్థమును తీసుకున్నచో ఈ పునరుక్తి దోషముండదు. దీనితో పునరుక్త వదా భాస అలంకారమను ఒక సుందరమైన అలంకారము తయారగును. ఏ పదమైనా పునరుక్తి కాని చోట పునరుక్తివలే కనబడుచున్నచో దానిని పునరుక్త వదా భాసమందురు. ఇచ్చట 'విశిఖ' శబ్దము వాస్తవమునకు పునరుక్తి కాలేదు. కాని పునరుక్తి ఐనట్లు కనబడుచున్నది. వేదమంత్రములోని ఈ భాగములో రెండు అలంకారములు ఎంత సుందరముగా సమకూర్చబడినవి! వాస్తవమునకు ఈ మంత్రములోని ముఖ్య అలంకారము- పూర్ణోపమాలంకారమే. కాని 'విశిఖ' శబ్దమును వాడుట వలన దాని కంటె ముందున్న బాణ శబ్దముయొక్క ప్రతిబింబము ఆ 'విశిఖ' శబ్దముపైన పడుటవలన మరొక సుందరమైన పునరుక్తవదాభాస అలంకారము కూడా ఏర్పడుచున్నది.

**(ఆ) <u>కారణమాల-మాలా దీపక అలంకారములు</u>**

***ఓమ్ వ్రతేన దీక్షామాప్నోతి దీక్షయాప్నోతి దక్షిణామ్।***
***దక్షిణా శ్రద్ధామాప్నోతి శ్రద్ధయాసత్యమాప్యతే॥***

**(యజుర్వేదం 19-30)**

వ్రతముతో దీక్ష, దీక్షతో దక్షిణ, దక్షిణతో శ్రద్ధ, శ్రద్ధతో సత్యములు లభించును. ఈ వేదమంత్రములో కూడా రెండు అలంకారములున్నవి. ఒకటి : కారణమాలాలంకారము. రెండవది: మాలా దీపకాలంకారము. తరువాత తరువాత చెప్పబడిన వస్తువునకు ముందు ముందు చెప్పబడిన వస్తువు కారణమైనచో లేక పూర్వ-పూర్వ వస్తువు ఉత్తర ఉత్తర వస్తువునకు కారణమైనచో గాని అది కారణ మాలాలంకారము. ఈ మంత్రములో జయప్రదముగా కారణమాల'ను కలుపవచ్చును. వ్రతము దీక్షకు కారణము. దీక్ష దక్షిణకు కారణము. దక్షిణ శ్రద్దకు కారణము, శ్రద్ధ సత్యమునకు కారణము. ఈ మంత్రములోని రెండవ అలంకారము-మాలా దీపకాలంకారము. ముందు ముందున్న వస్తువులతో తరువాత తరువాత ఉన్న వస్తువులు ఉపకృతములైనచో

అది మాలా దీపకాలంకారమగుచున్నది. వ్రతముతో దీక్ష ఉపకృతమగును (దగ్గరగును)దీక్షతో దక్షిణ, దక్షిణతో శ్రద్ధ, శ్రద్ధతో సత్యము ఉపకృతములగుచున్నవి. అనగా లభించుచున్నవి. ఈ మంత్రములో కూడా రెండు అలంకారములు చాలా సుందరముగా సమన్వయము చేయబడినవి (కలుపబడినవి). ఈ రెండింటి వలన మంత్ర స్వరూపము ఎంత సుందరముగా కనబడునో తెలిచుచున్నది.

(ఇ) <u>శ్లేషాలంకారము :</u>

*మం॥ బ్రహ్మ చర్యేణ కన్యాయువానం విందతే పతిమ్,*
*అనడ్వాన్ బ్రహ్మచర్యేణా శ్వోఘానం జిగీర్షతి॥*

***(అథర్వ వేదం 11-5-8)***

పూర్ణ బ్రహ్మచర్యమును పాలించిన కన్య యువకుని పతిగ పొందును. అని మంత్రములోని పూర్వ భాగము యొక్క అర్థము కాని ఉత్తరార్థములోని మంత్ర భాగము యెక్క అర్థము స్పష్టముగా లేదు. ఈ ఉత్తర భాగంలో శ్లేష యున్నది. అందువలన దాని అర్థము తెలుసుకొనుట కొంత కఠినముగా నుండును. ఎద్దు, గుర్రములు బ్రహ్మచర్యముతో గడ్డితినుచున్నవి. అని దీని సామాన్యార్థము. ఈ అర్థము సంగతము(సరికాదు)కాదు. దీనికి సమాధానము ఈ విధముగా నగును. ఈ మంత్రములోని ఉత్తర భాగంలో అనడ్వాన్=ఎద్దు. అశ్వ=గుఱ్ఱము మరియు ఘాస=గడ్డి అను మూడు శ్లిష్ట శబ్దములు, ఈ శబ్దములకు రెండేసి అర్థములుఉన్నవి. అనడ్వాన్ మరియు అశ్వ శబ్దములకు పురుషుడని, ఘాస అనగా భోగ మని రెండవ అర్థములు. ఈమంత్రములో శ్లేషాలంకారమున్నదని తెలిసిన తరువాత ఈ మంత్రమునకు సరియైన అర్థము ఈ విధముగా అగును. అది కన్య బ్రహ్మచర్యముతో యువకుడైన పతిని పొందును. పురుషుడు బ్రహ్మచర్యమును పాలించిన తరువాత భోగములను కోరును.' ఈ విధంగా అలంకారములను అర్థముచేసుకున్నచో మంత్రార్థమును, భావమును తెలును కొనుటలో ఎట్టి కష్టముండదు. ఈ విధంగా వేదమంత్రములలో చాలా నుందరమైన అలంకారములున్నవని తెలుసుకున్నాము. ఈ ప్రకరణములో చూపిన ఉదాహరణల ద్వారా వైదిక

భాషలో నిగూఢమైన రహస్యములు నిండియున్నట్లు అవి అలంకారముల ద్వారా చక్కగా అలంకరింపబడినట్లు నిరూపింపబడినది. ఇచ్చట కేవలము పరిచయము మాత్రమే చేయబడినది. అనేక వేదమంత్రాలలో శ్లేష రూపకాలంకారములున్నవి. కాని వైదిక భాష యొక్క యథార్థ జ్ఞానము లేని వారు మాత్రము వేదములలో ఇతిహాసము(చరిత్ర)లు, అసంగత విషయములున్నవని అనుకొందురు. కాని వారు వైదిక భాషయొక్క తత్త్వమును బాగుగా తెలుసుకున్నచో ఇతిహాసములెక్కడా వారికి కనబడవు. వైదిక భాషలో అలంకారములు అధికముగా నున్నట్లు, వేదములనుండే ఆధునిక ఉత్కృష్ట విద్వాంసులు కూడా భాషను అలంకరించుట నేర్చుకొనిరనియు తెలియును.

## వేదములలో రసములు

వేదముల మహత్త్వము నెరిగిన వారు, వేదములలోని రహస్యములతో పరిచయమున్న వారు, వైదిక సాహిత్యము చాలా సరసమైనదని యే అందురు. కాని వేదముల గొప్పతనమును వానిలోని నిగూఢమైన రహస్యములను తెలుసుకొననివారు, వైదిక సాహిత్యమును మనన పూర్వకముగా స్వాధ్యాయము చేయనివారు వైదిక సాహిత్యము చాలదురూహ్యము, నీరసము. దీనిని స్వాధ్యాయము చేయుటవలన ఎటువంటి ఆనందము లభించదని తలంచుచుందురు. ఈ భావనతోనే వైదిక సాహిత్యమును అధ్యయనము చేయుట మాని వేసి ప్రజలు లౌకిక సాహిత్యము వైపు మరలిరి. లౌకిక సాహిత్యమునే అన్ని రసాలకు మూల శ్రోతస్సుగ, భండారముగ వారు చూచుచుందురు.

వైదిక సాహిత్యమును అధ్యయన మొనర్చుట వలన కలుగు ఫలములనువివరించుచు విశ్వనాథకవిరాజు తనప్రసిద్ధగ్రంథమైన 'సాహిత్య దర్పణము'లో యిట్లు వ్రాసిరి.

చతుర్వర్గ ప్రాప్తిర్హి వేదశాస్త్రేభ్యో నీరసతయా దుఃఖాదేవ పరిణత బుద్ధీనామేవ జాయతే పరమాంద సందోహజనక తయాసుఖాదేవ సుకుమార బుద్ధీనామపి పునఃకావ్యాదేవ। నను తర్హి పరిణత బుద్ధి భిః సత్సు వేద శాస్త్రేషు కిమితి కావ్యే యత్నః కరణీయ ఇత్యపిన వక్తవ్యమ్। కటుకౌష ధోపశమ నీయస్య రోగస్య

సితశర్కరోపశమనీయత్వే కస్య వా రోగిణః సితశర్కరా ప్రవృత్తిః సాధీయసీ న స్యాత్' అనగా: కుశాగ్రబుద్ధులైన మనుష్యులకే వేదశాస్త్రముల ద్వారా చాల కష్టముతో ధర్మ అర్థకామ మోక్షములు లభించును. ఏలయన వేదాది శాస్త్రములు నీరసములు. అటువంటప్పుడు కుశాగ్ర బుద్ధి కలవారు వేదములుండగా కావ్యములపై సమయమును వ్యర్థపరచుటెందులకు? అనుట సరి కాదు. ఏలయన చేదుమందుతో నయమగు జబ్బు పటిక బెల్లం లేక చక్కెరలతో నయమగుచో పటికబెల్లం, చక్కెరలను సేవించని రోగి ఎవరుండును? ఈ విద్వాంసుడు తన రచనలలో వేదములు నీరసములు (రసములేనివి) అని స్పష్టముగా చెప్పెను. తరువాత వేదములను చేదుమందు తోను, లౌకిక సాహిత్యమును పటిక బెల్లం లేక పంచదారతోను పోల్చెను. లౌకిక సాహిత్యములో పటికబెల్లం పంచదారలలో గల రసము, వైదిక సాహిత్యములో చేదుమందులో నుండు రసము అనగా పూర్తిగా నీరసము (రసము లేనిది) మరియు చేదుకూడా అని అతని అభిప్రాయము. ఈ విధంగా వేదములపట్ల మనుష్యులకు అసహ్యమును కలిగించెడు మలిన మనోవృత్తి తెలియజేయు ఉదాహరణలు అనేకము లభించును. నిజంగా వేదము నీరసమా - రసములేనిదా? అను విషయమును నిర్ణయించుటకు ముందు రసమనగానేమి? దేనిని రసమందురు? అను విషయములు తెలుసుకొనుట అవసరము.

సాహిత్య శాస్త్రాచార్యులు రసమును కావ్యమునకు ఆత్మ అనిరి. రసము ఆనందమయము. ఆ ఆనందము కూడా లోకోత్తరము. మరియు బ్రహ్మాస్వాద సహోదరము. అనగా బ్రహ్మాస్వాదముతో లభించు ఆనందమే రసాస్వాదముతో కూడా లభించుచుండును. చీకటి లోనున్న ఘటము(కుండ) మున్నగునవి వెలుతురుతో కనబడునట్లుగ రసములు తెలియబడవు. రసమునకు ఆకారము లేదు. కనుక అది కంటికి కనబడే పదార్థము కాదు. పాలు వేరొక పుల్లటి పదార్థముతో కలిసి మార్పుచెంది పెరుగుగా పిలువబడునట్లుగా కావ్యములోని విభావము, అనుభావము, సంచారి భావముల కలయిక తో మార్పు చెంది రసము వేరుగా తెలియబడు చుండును. ఇది సహృదయులైన జనుల సంవేద్యమే. యోగులే బ్రహ్మసాక్షాత్కారమును చేసుకొనగలుగునట్లుగ

రసాస్వాదము కూడా పుణ్య వంతులు సహృదయులైన వారి కే లభించును.

విభావాదులతో రసము ఎట్లు తెలియబడును? విభావాదుల కలయిక ఎట్లు ఏర్పడును? విభావము, అనుభావము, సంచారిభావములన గానేమి? రతి అనగా నేమి? రసములెన్ని? సాహిత్య శాస్త్రములో ఏరసము ముఖ్యమైనదిగ చెప్పబడును? ఏఏ సమయాలలో యేయే రసాలు ప్రధానమైనవి? మున్నగు ప్రశ్నల కిచ్చట జవాబిచ్చుటలేదు. ఇచ్చట కేవలము వేదములలోని ఒకటి రెండు రసములను గూర్చి ఉదాహరణలనిచ్చి వానిలో ఏరసమున్నదో తెలియజేయుదును.

**(అ) <u>వీరరసము</u>**

వేదములలో వీరరసము అనేక చోట్ల వర్ణింపబడినది. ఎన్నో సూక్తములే కేవలం వీరరస వర్ణనలు కలిగి యున్నవి.

**మం॥ పరః సహస్రా హన్యన్తాం తృణే ధ్యేనాన్ మత్యం భవస్య (అథర్వ వేదం 8-8-11)**

పరః సహస్రాః=అనేక వేలశత్రువులు, హన్యన్తాం=నష్టమగుగాక,భవస్య=రుద్రుని లేక సేనావతి యొుక్క, మత్యమ్=అస్త్రములు లేక వజ్రాస్త్రము, జనాన్=ఈశత్రువులను,

తృణేధు=నాశనము చేయుము.

**మం॥ హత వృత్రం సుదానవ ఇంద్రేణ సహసాయుజామానేదుః =శంస ఈశత॥**

**(ఋగ్వేదం)**

ఉత్తమ జలము మరియు సూర్య కిరణములగ్రహించునట్టి వాయువు ఏవిధంగా, ఇంద్రేణయుజా=విద్యుత్తుతోకలిసి సహసావృత్రమ్=బలముగా మేఘమును కొట్టునో అట్లే, సుదానవ=ఓ అభిప్రాయము.ఈవిధంగా వేదములలో మార్పు ఏమీ లేదు. నిజంగా యూరోపియన్ శాలువా మూల్యం (ఖరీదు) మారులేకుండా ఇచ్చినా దానిని మనము వాడరాదు. అని సర్ థామస్ మన్రో పదార్థములన్నిటికి ఆధారమని చెప్పుచున్నది.ఋగ్వేద 1-64-3 మంత్రంలో

గ్రహించునట్టివాయువుఏవిధంగా.ఇంద్రేణయుజా=విద్యుత్తుతో హత=చంపుము
దుః శంసః= చెడుశాసనమును చేయు దుష్టపురుషుడైన రాజు
మా ఈశత= ఎన్నడూ పాలించకుండును గాక
మం॥ ఇంద్రసేనాం మోహయా మిత్రాణామ్।
**అగ్నేర్వాతస్య ధ్రాజ్యా తాన్వి షూచో వినశయ॥ (అథర్వవేదం 3-1-5)**

ఓ సేనా పతి! నీవు శత్రువులసైన్యమును బంధింపుము. అగ్ని వాయువుల సంచలనముతో అనగా ఆగ్నేయాస్త్రము వాయవ్యాస్త్రముల ద్వారా దూరముగా నున్న శత్రువులను నాశనముచేయుము. ఈ వేదమంత్రములలో వీర రసము బాగా కనబడుచున్నది. లౌకిక సాహిత్యములోని వీర రసము దీనికంటె గొప్పగా ఉండదు.

(అ) <u>శాంత రసము</u>

వేదములలో శాంతరసము ప్రధానంగా ఉన్నది. వృద్ధావస్థలో శాంతిని కోరువారు వేదములు ఉపనిషత్తుల స్వాధ్యాయమునారంభింతురు. కనుక వేదములలో శాంతరసము కూడా ఉన్నదనిచెప్పుటకువేదమంత్రమునుఉదాహరణగనివ్వవలసినఅవసరము లేదనిఅంతా అంగీకరింతురు

**(ఇ) శృంగార రసము**

శృంగార రసము కూడా వేదములలో అచ్చటచ్చట కనబడుచుండును
మం॥ **ఉత త్వః** పశ్యన్న దదర్శ **వాచముత త్వః**శృణ్వన్న శృణోత్యేనామ్।
**ఉతో త్వ**స్మై తన్వం విసస్రే **జాయేవ పత్య ఉశతీ** సువాసాః (ఋగ్వేదం)

ఈ వేదమంత్రం లోని నాల్గవ పాదమే మనకు ముఖ్యము. భార్య సుందర వస్త్రములను ధరించి కామరూపిపైయై తనను తాను పతికి సమర్పించు కొనుననిదీని అభిప్రాయము. ఈవిధంగా వేదములలో రసములన్నింటిని ఆస్వాదించవచ్చును.

## ప్రాచీన భారత దేశము-పాశ్చాత్య విద్వాంసులు

వేదము విజ్ఞానమునకు భండారము. విద్=జ్ఞానే' అను ధాతువుతో వేదశబ్దము తయారగుచున్నది. కనుక వేదమనగా జ్ఞానమని అర్థము. జ్ఞానమను పేరు గల పుస్తకములో జ్ఞానము, విజ్ఞానములకు సంబంధించిన విషయములుండునని ప్రతి వారు సరళముగా తెలుసుకొనగలుగుదురు. వేదములో పరమేశ్వరుని మొదలు తృణ పర్యంతము (వరకు) గల పదార్థముల విజ్ఞానము కలదు. ప్రపంచములో అన్నింటికంటె పెద్ద విజ్ఞాన పుస్తకము వేదము. సృష్ట్యారంభములోనే వేదముల జ్ఞానము మానవులకు లభించినది

1. వేదములు అపౌరుషేయములు (మానవ రచితములు కావు) అని దిగ్గజముల వంటి సమస్త విద్వాంసులు అంగీకరించిరి. ప్రపంచములోని గ్రంథాలయములో అతి పురాతనమైన పుస్తకము వేదము. వేదముల ద్వారానే సమస్త విజ్ఞానము విస్తరించినది. వేదప్రచారము - వికాసము అన్నింటికంటె ముందు భారత దేశములోనే జరిగినది. సృష్టి ఉత్పత్తి కూడా మున్ముందుగ ఇచ్చటనే జరిగినది.

2. భారతీయులు మెదట వైదిక విజ్ఞానములో పండితులు. వైదిక సభ్యత ప్రభావమువారిపైనున్నది. మహర్షి దయానంద సరస్వతి ఆర్యసమాజ నియామములలో యిట్లు వ్రాసిరి. వేదము సమస్త సత్య విద్యల పుస్తకము. ఋగ్వేదాది భాష్య భూమికలులో "వేదములో అన్ని విజ్ఞానముల" కలవు అని వ్రాసిరి. ఇదే విధంగా శ్రీ శంకరాచార్యులు కూడా వేదాన్త దర్శనమునకు భాష్యమును వ్రాయుచు ఋగ్వేదము అన్ని జ్ఞానములకు భండారమని వ్రాసరి. ఇట్లే అనేకమంది యితర భారతీయ విద్వాంసులు కూడా వేదములు విజ్ఞానభండారములని అంగీకరించుచున్నారు. భారతీయ విద్వాంసులైతే తమ ధర్మ గ్రంథములను ప్రశంసించెదరు కనుక వారి ప్రశంసలనెవరైనా శంకించి తిరస్కరించ వచ్చును కానీ, వేదము విషయములో ఒక గొప్ప విశేషమేమనిన: విదేశీయ విద్వాంసులు కూడా వేదములలోని విజ్ఞానమును పక్షపాతంలేకుండా ముక్తకంఠంతో ప్రశంసించుచున్నారు. ఈ వేద విజ్ఞానమును స్వదేశీయులు - విదేశీయులు కూడా అనుసరించుచున్నారు.

ఇచ్చట కొందరు విదేశీయ విద్వాంసుల అభిప్రాయములు ఇచ్చుచున్నాము.

(అ) సభ్యత

1. 20 ఫిబ్రవరి 1884 డైలీ ట్రిబ్యూన్ అనే పత్రికలో డి.ఓ. బ్రౌన్ అనునతడు "పక్షపాతము లేకుండా బాగుగా పరీక్షించినచో భారతీయులే ప్రపంచములోని సాహిత్యము, ధర్మము, సభ్యతలకు జన్మదాతలు" అని అంగీకరించెను.

2. చైనారాయబారి మెగస్తనీసు యిట్లు వ్రాసెను." భారతీయులు విదేశీయులను కూడా బానిసలుగ చేయరు. స్వదేశీయుల నెందుకు చేయుదురు?"

3. యూరపు లోని అనేక మంది (డాక్టర్లు) వైద్యులు దగ్గర బంధువులను వివాహము చేసుకొనుట హానికరమని అభిప్రాయ పడుచున్నారు. ఈ పద్ధతిని అనుసరించినచో విద్వాంసులు, తేజస్సుగల మేధావి శిశువులు ఉత్పన్నము కారు. ఇదే విధంగా శవమును భూమిలో పాతి పెట్టుట కంటే దహనము చేయుట మంచి దని తెలుసుకొను చున్నారు. ప్రసిద్ధ యూరపు తత్త్వ వేత్త హార్బర్టు స్పెన్సర్ తన శవమును పాతి పెట్ట రాదని దహనము చేయవలయునని జీవించియుండగానే ముందుగా వ్రాసిపెట్టెను.

4. దాదాపుగ నవీన, పురాణ చరిత్ర కారులందరు దర్శనములు, విజ్ఞానము సభ్యతలకు సంబంధించిన విషయాలన్నింటినీ యూనాన్ భారత దేశము నుండే నేర్చుకున్న దని అంగీకరింతురు. ఈ విధంగానే భారత దేశంనుండి ప్రపంచ మంతటా యివి ప్రాకినవి. ఇచ్చటి నుండి వెళ్ళిన భారతీయులే యూరపు అరబ్బు దేశములను కూడా అభివృద్ధి చేసిరి. భారతీయులు తమ దేశములో విద్య, కళా కౌశల్యములలో ప్రవీణులై ఇతర దేశాలలో ప్రచారము చేయసాగిరని నేటి ప్రపంచ చరిత్ర మరియు పురాతత్వ శాస్త్ర పరిశోధసలు స్పష్టముగా తెలియజేయు చున్నవి.

5. జాడ తెలియని వారు తూర్పు దిశనుండి (భారతదేశము నుండి) వచ్చి అచ్చట నివసించినట్లు - వారుగొప్ప బుద్ధిమంతులు, విద్వాంసులు కళాకౌశలము

కలవారని యూనాన్ ప్రాచీన చరిత్రలో వ్రాసి యున్నది. వారచ్చట విద్య వైద్యము లను గూర్చి ప్రచారము చేసి అచ్చట ప్రజలకు సభ్యత నేర్పి వారిని తమకు విశ్వాస పాత్రులుగ చేసుకొనిరి.

6. తూర్పు వైపునుండి (భారత్) నుండి వచ్చి యూనాన్‌లో నివసించి అచ్చటి సభ్యత తెలియనివారిని తమ అధీనములో నుంచుకొన్నవారు ఎట్లుండిరి! వారు దేవతలవంశములోనివారు.వారివద్ద తమస్వంత సైన్య ముండెను. వారు సిల్కు, ఉన్నితో నేసిన దుశ్శాలువాలను ధరించుచుండిరి'అని ఏరియన్ చెప్పుచున్నది.

7. కౌంట్ జార్నస్ జెర్నా అను నతడు 'హిందువుల దేవతల వంశావళి' అను గ్రంథములో "ఆరావర్తము కేవలము హిందువుల ధర్మమునకే నిలయము కాదు. అది ప్రపంచ సభ్యతలకు ఆది భండార"మని వ్రాసిరి.

8. న్యూయార్కుకు చెందిన డెల్మార్ అను నతడు ఇండియన్ రెవ్యూ అను ఒక వ్యాసములో పాశ్చాత్య జగత్తు ఏవిషయములో గర్వించుచుండునో అవి వాస్తవమునకు భారత దేశమునుండే అచ్చటకు వచ్చినవి. రకరకములైన ఫలములు - పుష్పములు, చెట్లు, పొదులు ఇప్పుడు యూరపులో పుట్టునవన్ని భారత దేశమునుండే తెచ్చి అచ్చట నాటి పెంచబడినవి. మఖమల్ సిల్క్, గుర్రములు, సీసము, లోహములను గూర్చి ప్రచారము కూడ భారత దేశమునుండే వచ్చినది. ఇవే కాక జ్యోతిషము,వైద్యము,శిల్పకళ,శాసనముకూడా భారత దేశస్థులు యూరపువాసులకు నేర్పిరి.

<u>ఆ.సాహిత్యము</u>

1. "యూరపుదేశములోని ప్రథమదార్శనికులైన ప్లేటో పైథాగొరస్ (పృథ్విగురు)లుయిరువురు కూడా "దర్శనశాస్త్రముల విషయములో భారతవాసులకు ఎంతో ఋణపడి యున్నా"రని మోనియర్ విలియమ్స్ వ్రాసెను.

2. లైథ బ్రిజ్ తన చరిత్రలో భారతీయులను గూర్చి చాలా దురాగ్రహము, పక్షపాతములతో వ్రాసెను. ఐనా దర్శనశాస్త్ర ఆదిగురువులు ఆర్యులే అని

ఒప్పుకొనక తప్పలేదు.

3. ప్రొ. వెబర్ మరియు కోల్ బ్రూక్‌లు చైనా మరియు అరబ్బుల జ్యోతిష విద్యల వికాసము భారత దేశమునుండే జరిగినట్లు నిరూపించిరి.

4. అల్బేరూనీ అంకగణిత శాస్త్రంలో భారతీయులు ప్రపంచములోని యితర దేశస్థులకంటే ముందున్నారని వ్రాసెను. " నేను అనేక భాషలలోని అంకెల పేర్లను నేర్చుకున్నాను. కానీ ఏదేశము లోను వేయికంటె తరువాత పేరు నాకు లభించలేదు. కానీ భారతీయులలో 18 సంఖ్యల వరకు గల అంకెల పేర్లున్నవి. వారు దానిని పదార్థమందురు, అని వ్రాసెను.

5. బీజగణితము, రేఖా గణితములను కనుగొని, జ్యోతిషశాస్త్రంలో వానిని ముందుగ ఉపయోగించిన వారు భారతీయులని మోనియర్ విలియమ్స్ వ్రాసెను.

6. "ప్రపంచ మానవులంతా రేఖాగణితంలో భారత దేశమునకే ఋణపడి యున్నారు. యూనాన్ దేశస్థులకు కాదు." అని థిబో వ్రాసెను.

7. "ప్రపంచములో నున్న ఏ భాషా సంస్కృత భాష అంతటి పూర్ణభాష కాదు. శబ్దముల యొక్క ధాతువుల వివరములు సంస్కృత భాషలో లభ్యమైనట్లుగ మరే భాషలోనూ దొరకవు" అని స్కెజల్ అను నాతడు వ్రాసెను

8 "సంస్కృత భాషయే ప్రపంచభాషలన్నింటికి జనని"(తల్లి) అని డా॥ వెలంటైన్ వ్రాసెను.

9. "సంస్కృత భాషతో సమానమైనది ప్రపంచంలో మరే భాషాలేదని, యూరపులోని భాషలన్నీ సంస్కృతమునుండే పుట్టిన"వని డబ్లు.సి. టేలర్ అభిప్రాయము.

10. "కేవలము భారతీయులు, యునానీలు మాత్రమే వ్యాకరణ శాస్త్రమును అభివృద్ధి పరచిరి. కాని ప్రపంచమంతటికీ గొప్ప వైయ్యాకరణుడైన పాణిని (అష్టాధ్యాయీ)గ్రంథముముందుయూనానీలవ్యాకరణశాస్త్రముఎందుకు కొరగాదు" అని ప్రొ. మాక్సములర్ వ్రాసెను.

11. "ఆయుర్వేద గ్రంథాలైన చరక సుశ్రుతములు నేటికిని వైద్యులకు ఎంతో ఉపయోగ పడుచున్న"వని మౌలానా హాలీ వ్రాసెను.

12. "ప్రాచీన కాలంలో భారతీయులకు శస్త్ర చికిత్స , చేయుటలో సంకోచముండేది కాదు. వారు వైద్యంలో యూనానీల నుండి ఏమీ నేర్చుకోలేదు. కాని భారతీయులే యూనానీల కెంతో నేర్పిరి." అని డా॥ హంటర్ వ్రాసెను.

13. "శస్త్ర చికిత్సలో భారతీయులు పొందిన సఫలత రసాయన శాస్త్ర ఉన్నతిలో వారు పొందిన సఫలత వలెనే ఆశ్చర్యమును కలిగించును." అని హానరబుల్. ఎల్ఫెంస్టన్ వ్రాసెను.

<u>కళా కౌశలము</u>

1. చైనా యాత్రికుడు మెగస్తనీసు - స్వచ్ఛమైన వాయువులో (వాతావరణములో) నివసించుచూ ఉత్తమ జలమును (చక్కని మంచినీటిని) త్రాగు ప్రజలనుండి కోరదగినట్టుగ భారత దేశస్థులు శిల్పకళలో చాలా నిపుణులని వ్రాసెను.

2. కుతుబ్ మీనార్ వద్ద నున్న లోహపు స్తంభమును గూర్చి డా॥ ఫర్గుసన్ యిట్లు వ్రాసెను. భారతీయులు ఆ కాలంలోనే ఇంత పెద్ద స్తంభములను తయారు చేస్తూండేవారని, ఇలాంటివి యూరపులో ఈ మధ్య వరకూ కూడా తయారు కాలేదని ఎటు వంటి సందేహం లేకుండా చెప్పే ఈ స్తంభము మనకు కను విప్పును కలిగించు చున్నది.1400 సం॥రం.లుగ వర్షమునకు తడుస్తూ, ఎండకు ఎండుతూ ఉన్నా దానికింతవరకూ తుప్పు పట్టలేదు.

చైనా యాత్రికుడు పాహియాన్ తన యాత్రలోని వృత్తాంతములను యిట్లు వ్రాసెను. శిథిలమైయున్న అశోక చక్రవర్తి యొక్క రాజ మహలును గూర్చి వ్రాయుచు అశోకుడు ఈ రాజమహలును తప్పకుండా దేవతలచే నిర్మింపజేసి యుండును. దీని ఎత్తైన గోడలు, కోటద్వారములు, చౌకట్లు (నలు చదరపు దూలాలు) మానవులు తయారు చేయజాలరు. అని వ్రాసెను.

4. ఢాకేతో చేసిన బట్టలను చూచిన దేవతలు తయారుచూసినట్లుగ కనుపించును. వానిని మానవులు చేసినట్లుగ ఉండవు. అని వైన్స్ వ్రాసెను.

5. భారత దేశ శాలువాను 7 సం॥రంలుగా వాడుతున్నా దానిలో పెద్ద

మార్పు ఏమీ లేదు. నిజంగా యూరోపియన్ శాలువా మూల్యం (ఖరీదు) లేకుండా ఇచ్చినా దానిని మనము వాడరాదు. అని సర్ థామస్ మన్రో అనెను.

(ఈ) <u>విద్యా బుద్ధులు - చరిత్ర</u>

ఒకసారి అధ్యాపకుడైన మాక్స్‌ములర్ తన వ్యాఖ్యానములో యిట్లు చెప్పెను. ఉత్తమోత్తమ గుణములను వృద్ధి చేయగలిగినట్టియు, మానవసంబధమైన గొప్ప గొప్ప రహస్య విషయంలపై ఆచోచనలు జరిపి వానిని పరిష్కరించగలిగినట్టియు, మానసిక ఉన్నతిని పొందినట్టియు ప్రజలు గల దేశము ఏది? ఆ దేశము ఎచ్చట ఉన్నది? అని ఎవరైనా నన్నడిగితే నేను అది భారతదేశమని జవాబు యిచ్చెదను.

2.సికిందర్ బారతదేశమునకు వచ్చినప్పుడు ఇచ్చట ' దండి' అనుపేరుగల ఒక తపస్వి యైనబ్రాహ్మణదుండెను. అయన ముని వృత్తితో వనములలో నివసించు చుండెను. ప్రజలంతా అయనను ప్రశంసించుట విని సికిందర్ అయనను కలుసుగొన గోరెను. దండిని తీసుకు వచ్చుటకై దూతలను పంపెను. కానీ దండీ సికిందర్ వద్దకు వచ్చుటకు నిరాకరించెను. చివరకు సికిందరే ఆయనను కలుసుకొనుటకై శిష్య భావముతో వెళ్లి ఆ ముని ఉపదేశములను విని కృతార్థుడయ్యెను. ఈ ఘటనను వ్రాయుచు మెగస్తనీసు ఇట్లు వ్రాసెను,

అనేక దేశములను ఓడించిన సికిందర్ భారతదేశంలోని ఒక నగ్న మునిచేతనే ఓడిపోయెను.

3. 1443 క్రీ.సం॥రంలో కాళీ కోటకు వచ్చిన సుల్తాన్ శాహరుఖ్ తన అబ్దుల్ రజ్జాక్ ముతాలుల్ సాదీన్' అను పుస్తకములో యిట్లు వ్రాసెను, "బజారులో వస్తువులన్నీ యజమానిలేకుండా ఉంచబడను. కానీ ఎవరూ వానిని దొంగిలించరు."

4. కర్నల్ స్లీమెన్ అతని పుస్తకములో యిట్లు వ్రాసెను. 1. గ్రామంలో నివసించే ప్రజలు పంచాయితీలలో దృఢముగా సత్యమును సమర్థించే స్వభావమును కలిగియుందురు. నాముందు జరిగిన వందలాది అభియోగములలో మానవుల ఆస్తులకు సంబంధించినవి, స్వతంత్రమునకు

సంబధించినవి, ప్రాణములకు సంబంధించినవానిలో కూడా అసత్యమును చెప్పుటకు ఆ గ్రామవాసులు అంగీకరించరు.

(ఉ) ధనుర్విద్య

1. తుపాకీ గుండ్లు సర్వ ప్రథమముగా భారతదేశములో కనుగొనబడినవి. యూరపు వాసులకు తెలియుటకంటె ఎంతో ముందు నుండే భారతీయ సైన్యము తుపాకీ గుండ్లను వాడుచుండెనని ప్రొ. విల్సన్ వ్రాసెను. తుపాకీ గుండ్లను యూరపు దేశస్థులు తాము నేడు క్రొత్తగా కనిపెట్టినట్లు తలంచుచున్నారు. ఇదెంత ఆశ్చర్యమైన విషయము! అని మిస్టర్ ఈలియట్ అనెను.

(ఊ) విజ్ఞానము

1. ప్రొ. మాక్స్‌ములర్ తన పుస్తకంలో ఆర్యులంతా వైజ్ఞానికులే అని వ్రాసెను.

2. మి.డెఫ్ యిలా వ్రాసెను: భారతీయుల విజ్ఞానము చాలా విస్తృతమైనది. దానిలో యూరోపీయ విజ్ఞానములోని అంగములన్నీ లభించును.

3. మి.హంటర్ ఈ విధంగా తన అభిప్రాయమును తెలిపెను. బ్రాహ్మణుల విజ్ఞానము సూక్ష్మ విషయములన్నింటికి సూక్ష్మ ఉత్తరముల నిచ్చెను.

విదేశీయుల పై వచనములతో భారతదేశము ఎంతగొప్పదో అర్థమగుచున్నది. భారతదేశములోని కళా కౌశలము, సభ్యత, విద్యాబుద్ధులు, ఆధ్యాత్మిక ప్రవృత్తి, సాహిత్యాదులను చూచి పాశ్చాత్య విద్వాంసులు ఆశ్చర్యపోవుచుందురు. ఏ విజ్ఞానమును తాము కనుగొన్నట్లు తలంచుచు గర్వపడుచున్నారో దానికంటె ఉన్నతమైనది భారతీయ విజ్ఞానమని వారు ఆశ్చర్యపడవలసి వచ్చును. ఆది మానవులు సభ్యత, విజ్ఞానము, కళా కౌశల్యములు తెలియని వారని, విజ్ఞానధార ప్రతినిత్యము పశ్చిమ దేశములనుండి తూర్పు వైపునకు ప్రవహించుచున్నదని చెప్పు పరిణామ వాదుల, విజ్ఞానవాదులనబడే పాశ్చాత్య విద్వాంసుల మాటలు నిరాధారములు. వీరి మాటలు పైన చెప్పిన పాశ్చాత్య విద్వాంసుల మాటల ద్వారా ఖండింపబడుచున్నవి.



## ఈ బ్రహ్మాండమునకు మూలము - వాయువు

(హిందీ మూలం: బ్రహ్మచారి ప్రదీపార్య నైష్టిక్)

**వాయవా యాహి దర్శతేమే సోమా అరంకృతాః।**
**తేషాం పాహి శ్రుధీ హవమ్॥** **(ఋగ్వేదం 1-2-3)**

అర్థము: దర్శత= స్పర్శాది గుణములతో తెలుసుకొనుటకు తగిన
వాయో=ఆకారముగల పదార్థములన్నింటికి ఆధారము, ప్రాణుల జీవనమునకు కారణమైన భౌతిక వాయువు
ఆయాహి= అందరికీ లభించును.(మరియు అది)
ఇమే= ప్రత్యక్షమగు, సోమాః=ప్రాపంచిక పదార్థములను
అరంకృతాః=శోభిల్లజేసెను.(ఆ వాయువే),
తేషామ్=ఆ పదార్థములయొక్క, పాహి=రక్షణకు కారణమైనది,
హవమ్=ప్రాణులైన మానవులు దీనితో చెప్పుటకు, వినుటకు యోగ్యమైన వ్యవహారమును,
శ్రుధీ=చెప్పెదురు, వింటురు.

పైన చెప్పిన వేద మంత్రములో వాయువున కత్యంత మహత్త్వము ప్రకటమగు చున్నది. ఈ బ్రహ్మండమున కంతకూ ఆధారము వాయువే.స్పర్శాదిగుణములతో తెలుసుకొనదగు వాయువు యొక్క లక్షణము ముందుగా చెప్పబడినది.స్పర్శ శబ్దమునకు నిరుక్త శాస్త్ర కారుడైన యాస్కాచార్యులు కూడా'దర్శించదగినది' అనియే అర్థమును చెప్పిరి. స్పర్శతో బాటు ఆది శబ్దము యొక్క ప్రయోజనమును కూడా తెలుసుకొనవలయును. వైశేషిక దర్శనం లో కణాద మహర్షి - స్పర్శవాన్ వాయుః (2-1-4) వాయువునకు స్పర్శలక్షణమునే చెప్పిరి. ఆకాశాద్ వాయుః– వాయువు ఆకాశమునుండి పుట్టును. కనుక వాయువులో స్పర్శగుణముతో పాటు శబ్దగుణము లక్షణముగా గల ఆకాశము కూడా కలిసి యున్నట్లు చెప్పుకోవచ్చును. స్పర్శతో ఆది శబ్దమును జోడించుటకు బహుశా ఇదే కారణం కావచ్చును.ఇదొక పక్షము. మరొక పక్షముకూడా కావచ్చును. అది మహా భూతములలో చెప్పబడిన ఈ వాయువు కాక మరొకటి కావచ్చును. పై వేదమంత్ర మీ

వాయువును ఆకారముగల పదార్థము లన్నిటికి ఆదారమని చెప్పుచున్నది. ఋగ్వేద 1-64-3 మంత్రంలో కూడా మహర్షి దయానందు డీ అర్థమునే చెప్పిరి. దీనిలో వాయువును 'పర్వతా ఇవ' అనగా పర్వతమువలె ఆకారముగల పదార్థములన్నింటిని ధరించునదిగ చెప్పెను. పై వేద మంత్రములో తరువాత "సోమాః అరంకృతాః"- ప్రపంచములోని పదార్థములన్నింటిని శోభాయమానము చేయునది అని చెప్పెను. మహర్షి యాస్కు డీ మంత్రములోని 'సోమ శబ్దమునకు ఒక ఓషధి' అను అర్థమును గ్రహించిరి. కాని దయానందాచార్యులు 'సోమ' శబ్దమునకు వ్యాపకార్థమును గ్రహించిరి. సవత్యైశ్వర్య హేతుర్భవతి సోమః (ఉణాదికోశము) సంపూర్ణ ఐశ్వర్యమునకు కారణమైనది సోమ మని వ్రాసిరి. ఈ కారణము ప్రపంచమే యగును. సూతే అమృతమ్ (హలాయుధకోశము) అమృతమును పుట్టించునది. అమృత్వమును-మోక్షమును పొందుటకు సాధనము కూడా నిశ్చయముగా ఈ జగత్తే. 'వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యామృత మశ్నుతే' (యజుర్వేదం 40 -10) ఋగ్వేద 1-93-4వ మంత్రములో 'పవన' శబ్దమునకే సోమమని చెప్పెను. ఋగ్వేద 9-93-5వ మంత్రములో అధిదైవికార్థములో నిరుక్త కారుడు ప్రకాశము, అగ్ని, పృథివిలను ఉత్పన్నము చేయునది సోమమని చెప్పెను. ఈ విధంగా స్వయంగా వేదముతో నే 'సోమ' శబ్దము అతి వ్యాపక అర్థములు కలదిగ తెలియు చున్నపుడు మహర్షి దయానందుడు చెప్పిన అర్థము అసంగతము కాదు. అది ఆయన వ్యాపకదృష్టిని తెలియజేయుచున్నది. ప్రపంచమునందలి పదార్థములన్నిటికి ఆధారమైన వాయువు ఏది? వాతి గచ్ఛతి జానాతి వేతి స వాయుః పరమేశ్వరో వా' (ఉణాదికోశము - ఋ.ద) ఇచ్చట భౌతిక వాయువు ఐనట్లయితే వాతి గచ్ఛతీతి వాయుః' గతి కలిగిన పదార్థము వాయువు. వాయువునకు ముఖ్యలక్షణము - (గుణము) - గతి. స్థూలవాయువు ఎల్లప్పుడు గతిని కలిగియే యుండును. అనగా వీచుచుండును. ప్రపంచములోని ఏ కణము కూడా (అత్యంత సూక్ష్మ మైన విద్యుత్ కణములనుండి విశాలమైన లోక లోకాంతరముల వరకు) పూర్తిగా స్థిరముగ లేదు. ఈ విధంగా అంతటా

వాయువున్నది. అందువలన వేద మంత్రము అయా హి (అఙ్ పూర్వక యా=ప్రాపణే ధాతువు తో తయారైనది.) అనగా అంతటా చక్కగా ఉన్నది. అని చెప్పుచున్నది. దీనినే ఋగ్వేదంలో 1-93-6వ మంత్రములో 'మాతరిశ్వా' అని చెప్పెను. నిరుక్తాచార్యుడు దీనికి మాతరి (అంతరిక్షే) శ్వాసీతి గచ్ఛతివా' అంతరిక్షములో శయనించునది అని చెప్పిరి. దీనిలోనే 1-64-2వ మంత్రంలో ప్రకాశమునుత్పన్నముచేయునది. 1-93-5వ మంత్రంలో తారాగణముల ప్రకాశమును ధరించునది అని చెప్పబడినది. ఋగ్వేదంలో 1-64-4వ మంత్రంలో విద్యుతః అక్రన్'' విద్యుత్తునుత్పన్నము చేయునది వాయువు. అని చెప్పెను. వాయువీ పనులన్నీ ఎట్లు చేయును? అనునది ప్రశ్న. సూర్యాది గోళములలో జరుగు చున్న హైడ్రోజన్ సంలపన యొక్క తీవ్రవేగముతో జరుగు ప్రక్రియను మానవుడు తన నేత్రములతో చూడగలిగినచో ఈ విశాలమైన ఆకారముగల అగ్నిగోళములలో పెద్ద పెద్ద మార్పులు జరుగుచున్నవని తెలియును. భయంకరమైన తుఫాను వచ్చినపుడు సముద్రములో కలుగు తీవ్ర సంచలనము వలెనే ఈ అగ్ని సముద్రములలో కూడా ఎల్లప్పుడు వాయుగుండములు వీచుచునే యుండును. బహుశా ఇందువలననే వాయువు ప్రకాశము మున్నగు శక్తిని ఉత్పన్నము చేయునదిగ చెప్పబడినది. ఈ శక్తి మనవరకు కూడా తరంగాల రూపంలోనే వచ్చును. ఇది వాయు స్థితి లో యుండును. మరొక వైపు ఎక్కడైతే వాయువును విద్యుత్తునుత్పన్నము చేయునదిగ చెప్పెనో అచ్చట విద్యుత్తే సమస్త ప్రకృతికి సంబంధించిన కార్యములన్నింటికి ఆధారమని నా అభిప్రాయము. సృష్టి రచనలో అన్నిటి కంటె గొప్ప మహత్త్వముతో కూడిన సోపానము విద్యుత్ ఆవేశము యొక్క ఉత్పత్తి (voltage). దీనినే యజుర్వేదము ద్యౌరాసీత్పూర్వ''........అని, ఋగ్వేదము యస్మిన్ దేవా మన్మని సంచరంతి'' అని చెప్పెను. ఇప్పటి అగ్నిని ఈ వాయువు పుట్టించునదిగ చెప్ప జాలము. ఆకాశము ఉత్పత్తి యైన తరువాత అతి సూక్ష్మ కణముల చలనావస్థను వాయు రూప అవస్థగ చెప్పగలము. బహుశా ఈ రహస్యమునే ఋగ్వేదము 1-64-2వ మంత్రములో తే జజ్ఞిరే దివః' వాయువు దివ (ఆకాశ) పదార్థమునుండి ఉత్పన్నమగునని

చెప్పెను. ఈ దివమే యజుర్వేదములోని 'ద్యౌ''వాయువు' అనగా అతి సూక్ష్మకణముల చలనముతోనే ఈ ప్రపంచ నాటకమంతా జరుగుచున్నదను విషయము తెలిసినదే. సంయోగ - వియోగ క్రియలు - వాయువుతో అనగా సూక్ష్మకణముల చలనముతోనే జరుగుచున్నవి. ఇదే సమస్త సృష్టి లేక ప్రలయములకు మూలకారణము. అందుకే వేద విద్వాంసుడైన దయానంద సరస్వతీ, ఋగ్వేద1-64-3వ మంత్రములో యువానః శబ్దమునకు మిశ్రణా మిశ్రణ కర్తృత్వేన బలిష్ఠా' ఆ వాయువు మిశ్రణ - అమిశ్రణములు చేయునట్టి బలమైనది. విశ్వాభువనాని పార్థివా ప్రచ్యావయన్తి దివ్యాని మజ్మనా' ఋగ్వేద 1-64-3వ మంత్రము - తనబలముతో లోకములన్నింటిని నడిపించునది. అని, వేరొక మంత్రములోసోమాః అరం కృతాః' అన్నింటిని శోభిల్ల జేయు నదని చెప్పెను. వాస్తవమునకు గతియే స్థితికి కారణము. ఆ స్థితియే శోభ. ఇప్పుడు ఏదైన ఒక లోకము గాని సూక్ష్మ విద్యుత్ కణము గాని పూర్తిగా స్థిరమైనచో ఘోరమైన అనర్థము జరుగవచ్చును. అందువలన బ్రహ్మాండము యొక్క గతి లోనే దాని స్థితియుండునను రహస్యమును వేదము చెప్పుచున్నది. వేద మంత్ర భాష్యంలో ఋషి దయానందుడు వాయువును జీవనాధారముగ చెప్పెను. శరీరము వాయువు (దశప్రాణముల) పై ఆధారపడి యున్నది. ఋగ్వేద 1-64-4వ మంత్రములోనే 'వపుషే వ్యంజతే వక్షః సురుక్మాన్ అధిపేతిరే' హృదయాదులలో జఠరాగ్ని, విద్యుత్తు మున్నగు వానిని ఉత్పన్నము చేసి శరీరమును ధరించి పోషించునది. ఋగ్వేదము1-64-11వ మంత్రములో వాయువు పర్వతములను నాశనము చేయునదని కూడా చెప్పబడినది. ఇదొక విచిత్రమైన రహస్యముగ కనబడుచున్నది. పర్వతము యొక్క నాశనమనగా అగ్ని పర్వతము బ్రద్దలగుట, భూకంపాదులు కావచ్చునని నా అభిప్రాయము. అప్పుడు మనకు భూమిపై జరుగు క్రియలన్నీ వాయువు యొక్క సూక్ష్మరూప పరిణామమా లేక ఈ వాయు మండలమునకేమైనా సంబంధమున్నదా? అను విషయము పరిశోధనాంశముగ మిగులును. కాలుష్యప్రభావము కూడా ఏదైనా ఉన్నదా లేదా? అగ్నిపర్వతములు బ్రద్దలగుట మున్నగునవి భూమికి

66

అడుగు భాగములోని శక్తిని సమతూకములో నుంచుటకు సహాయపడుచుండవచ్చును. అలా ఐనట్లయితే ఇది భూమిని స్థిరముగా నుంచుటకు సహాయపడును. ఈ విషయమునే డా॥ మనోహర్ లాల్ గుప్త యజుర్వేద 1-11వ మంత్ర వ్యాఖ్యానములో తెలియ జేసెను. పై వేద మంత్రములో శ్రుధీహవమ్ అని చెప్పి శబ్దము యొక్క శ్రవణము యరియు అభివ్యక్తులలో వాయువు యొక్క సహాయమును అని వార్య మని చెప్పెను. శబ్దము వాయువునకు లక్షణము కాకున్నా మాధ్యమ మని చెప్పబడినది. **ఆకాశ వాయు ప్రభవః శరీరాత్ సముచ్చరన్ వక్త్రము పై తి నాదః! స్థానాంత రేమ ప్రవిభజ్య మానో వర్ణత్వ మాగచ్ఛతి యః స శబ్దః॥**

ఈ విధముగా వాయువు అంతరిక్షముల కలయికతో శబ్దము పుట్టును.

ప్రపంచములో ఏవస్తువు కూడా స్థిరంగా లేదని ఈ చలన గుణం వలననే ప్రపంచము నిర్మింపబడి రక్షింపబడి పాలింపబడుచున్నదని ప్రపంచములోని ఒక పెద్ద రహస్యమును పై వేదమంత్రము బహిర్గతము చేసినది. వ్యవహారమంతా దీని పైననే ఆధారపడి యున్నది. వేదమంత్రములో సంభవమగు ఆధిదైవిక పక్షముపై విశేషముగా పరిశోధనలు జరిపినప్పుడే ఋషి దయానందుని స్వప్నములు ప్రపంచ వ్యాప్తమగునని వైదిక విద్వాంసులతో ప్రార్థించుచున్నాను.

> **వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము,**
> **వేదమును చదువుట - చదివించుట,**
> **వినుట వినిపించుట, ఆర్యులకందఱకు**
> **పరమ ధర్మము.**
> (స్వామి దయానంద సరస్వతి)

# మా గాయత్రీ ఆశ్రమ ప్రచురణలు

| | | |
|---|---|---|
| 1. | గాయత్రీ మహిమ | 30-00 |
| 2. | గాయత్రీ విజ్ఞానం | 100-00 |
| 3. | మన ఇతిహాసం | 70-00 |
| 4. | మన వేదశాస్త్రాల పరిచయం | 70-00 |
| 5. | అగ్నిహోత్రం 100శాతం వైజ్ఞానికం | 60-00 |
| 6. | అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ* | |
| 7. | అగ్నిహోత్ర ఆధ్యాత్మిక స్వరూపము | 30-00 |
| 8. | గోమాత | 40-00 |
| 9. | వేదాలలో సూర్యకిరణ చికిత్స | 80-00 |
| 10. | వేదాలలో జలచికిత్సా విజ్ఞానం | 60-00 |
| 11. | పెండ్లినాటి ప్రమాణాలు | 40-00 |
| 12. | గర్భాదాన విజ్ఞానం | 50-00 |
| 13. | దౌహృదిని | 40-00 |
| 14. | మరణానంతరం జీవుని ప్రయాణం | 40-00 |
| 15. | మానవ ధర్మము | 40-00 |
| 16. | ఈశావాస్యమిదం సర్వం* | |
| 17. | దేవుడు - జీవుడు - ప్రకృతి | 30-00 |
| 18. | వేదాలలో అశ్వనీదేవతలు | 20-00 |
| 19. | సంధ్యావందనం - వైజ్ఞానిక సమాలోచన | |
| 20. | జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ* | 60-00 |
| 21. | వేదాల వెలుగుచూపె ఆర్యసమాజము | 30-00 |
| 22. | వైదిక జన్మదిన వేడుక | 30-00 |
| 23. | పండుగల పరమార్థం | 40-00 |
| 24. | వైదిక గృహప్రవేశ విధి | 30-00 |
| 25. | వేదాలలో వర్షేష్టి విజ్ఞానం | 25-00 |
| 26. | వైదిక క్రాంతి పథం | 40-00 |
| 27. | పురుషసూక్తము | 20-00 |
| 28. | వైదిక శాంతి పాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) | 20-00 |
| 29. | సృష్టికథ | 20-00 |
| 30. | సరస్వతీ సూక్తము | 10-00 |
| 31. | స్వతంత్ర సముపార్జనలో దయానందుడు | 10-00 |
| 32. | వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమము | 10-00 |
| 33. | గంగాధర శివుడు | 10-00 |
| 34. | ప్రణవస్తోత్రము | 10-00 |
| 35. | విశుద్ధ లక్ష్మీసూక్తము | 20-00 |
| 36. | వేదాలలో మనోవిజ్ఞానం | 20-00 |
| 37. | వేదామృతం * | |
| 38. | వైదిక సుప్రభాతం * | |
| 39. | శివరాత్రి రహస్యము* | |
| 40. | గణపతి రహస్యము | 20-00 |
| 41. | వేదాలలో దేశభక్తి | 50-00 |
| 42. | వేదాలలో దశ నియమములు * | |

ఇతర విద్వాంసుల రచనలు

| | | |
|---|---|---|
| 1. | మాతాపుత్రికల జ్ఞాన చర్చ | 60-00 |
| 2. | సత్యధర్మ విచారణ | 6-00 |
| 3. | స్వరాజ్యసంగ్రామములోఆర్యసమాజము* | |
| 4. | ధర్మవీర్ పం. లేఖారామ్ | 5-00 |
| 5. | వేదాలలో విజ్ఞానబీజాలు* | 30-00 |

## వైదిక సంస్కృతి - పాశ్చాత్య భక్తులు

వేదాలను, వైదిక సంస్కృతిని ప్రేమించే పాశ్చాత్య భక్తులు నేడు పెరుగుతుండగా భారతీయ భక్తుల సంఖ్య తరుగుచున్నది. భారతీయులు సంస్కృత భాషను అధ్యయనం చేయుట మానివేస్తున్నారు.

డేవిడ్ ఫ్రాలే పశ్చిమ దేశవాసి, ఈయన భారతీయనామం - వామ దేవశాస్త్రి. ఈయనకు వేదాచార్య అనే బిరుదును ప్రదానం చేసిరి. డేవిడ్ ఫ్రాలే యిప్పుడు సాన్తాఫీ, న్యూమెక్సికో, యు.ఎస్.ఏ. లో అమెరికన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ వేదిక్ స్టడీస్ అనే సంస్థకు డైరెక్టర్‌గా ఉన్నారు. ఈయన రచించిన గ్రంథాలలో అత్యధిక మహత్త్వం కలవి.

1. **ది మిథ్ ఆఫ్ ది ఆర్యన్ ఇన్వేజన్ ఆఫ్ ఇండియా,**
   (ఆర్యులు భారత దేశము నాక్రమించిరనుట కల్పిత కథ)
2. **వేదిక్ సీక్రెట్స్ ఆఫ్ ఏన్షియంట్ సివిలైజేషన్**
   (ప్రాచీన నాగరికతలోని వేద రహస్యాలు)
3. **విజ్డమ్ ఆఫ్ ది ఏన్షియంట్ సీర్స్**
   (ప్రాచీన ఋషుల పాండిత్యము)
4. **వేదిక్ ఆర్యన్స్ అండ్ ది ఆరిజన్ ఆఫ్ సివిలైజేషన్**
   (వైదిక ఆర్యులు మరియు నాగరికతకు మూలం)

ప్రొ. క్లాస్ క్లాస్టర్ మేయర్ రచించిన "సర్వే ఆఫ్ హిందూయిజం" అనే పుస్తకంలో భారతదేశంపై ఆర్యుల ఆక్రమణ అనే సిద్ధాంతముపై తీవ్ర అభ్యంతరాలను తెలియజేస్తూ సాక్ష్యాధారాలు ఇందుకు పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నాయన్నారు. న్యూయార్కు విశ్వవిద్యాలయం ప్రప్రథమముగా దీనిని పాఠ్యపుస్తకంగా ప్రచురించిది. అమెరికాకు చెందిన వేదాధ్యయన సంస్థ డైరెక్టర్ ప్రొఫెసర్. డేవిడ్ ఫ్రాలే భారతదేశంలోని విశ్వవిద్యాలయాలేవి ఇంతవరకు ఈ పని చేయలేదంటున్నారు.

VEDALALO VIGNANA BEEJAALU Rs. 30/-



శ్రీమత్ పరమహంస పరివ్రాజకాచార్య
**మహర్షి దయానంద సరస్వతి**
(1824-1883)

అత్ర చత్వారో వేద విషయాః సన్తి ।
విజ్ఞాన కర్మోపాసన కాండ బేదాత్ !
తత్రాదిమో విజ్ఞాన విషయో హి సర్వేభ్యోముఖ్యోఽస్తి
తస్య పరమేశ్వరాదారభ్య తృణ పర్యంత పదార్థేషు
సాక్షాద్‌బోధాన్వయత్వాత్ । తత్రాపి ఈశ్వరానుభవో ముఖ్యోఽస్తి

**మహర్షి దయానంద సరస్వతి**
(ఋగ్వేదాది భాష్య భూమిక వేద విషయ విచారః)